

కృతిపతులు:

సాహిత్యసమ్రాట్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారు

*

కృతిపతులు :

శ్రీమజ్జయపురసంస్థానాధీశ్వరులు,

సాహిత్యసమ్రాట్

శ్రీ శ్రీ శ్రీ శ్రీవిక్రమదేవవర్మ మహారాజావారు,

జయపురము

*

నౌకాభంగము :

వెల ~~పండ్రెండణాలు~~, రు 1-75 పై

సర్వస్వామ్యములు కృతికర్తవి.

*

ప్రతులు వలయువారు

సజ్ఝల వేంకటేశ్వరకవి, బి. ఏ.,

జయపురము,

విశాఖపట్టణము జిల్లా.

అను విలాసమునకు వ్రాయునది.

*

ప్రథమముద్రణము,

శ్రీముఖ సంవత్సరము.

# పీఠిక

ఏఁబదెన్మిదేండ్ల క్రిందట నేను విద్యార్థిదశయం దున్న తఱి, నా ప్రియబంధుఁడును సహాధ్యాయుఁడు నగు వఝ్ఝల కాళిదాసును నేనును గూడి వేంకటకాళిదాసకవులమై, యది మొదలుకొని యొకటిరెండేండ్ల పూర్వమువఱకు, మా రచనములఁ గొన్నిటిని భాషావిషయికపత్త్రికలయందును, గొన్నిఁటిని పుస్తకరూపమునను బ్రకటించుచు వచ్చితిమి. అవి యాంధ్రపాఠకులకుఁ బరిచితములని నా నమ్మకము. తరువాతఁ గొన్నికారణములచే మా జంట భిన్నమగుటయు, నా రచనములు నా పేరనే నేను బ్రకటించుచున్నాను. అట్టి వానిలోఁ బుస్తకరూపమున వెలువడిన మొదటికావ్య మిది 'నౌకాభంగము'.

'నౌకాభంగ' మనఁబడు నేతత్కావ్యమునకు మూలమాంగ్లకవి యగు టెనిసన్ రచించిన 'ఈనక్ ఆర్డెన్' అను పద్యకావ్యము. ఆంగ్లకావ్యమునందలి కథను హైందవసంప్రదాయబద్ధముఁ గావించి స్వతంత్రకల్పనలు సేర్చి పద్యకావ్యముగా రచించితిని.

శ్రీమజ్జయపురసంస్థానాధీశ్వరులును, సాహిత్యసమ్రాడ్బిరుదాంకులును, విద్వత్కవులును, కవిపోషకులును నగు శ్రీ శ్రీ శ్రీ శ్రీవిక్రమదేవవర్మ మహారాజావారు మత్కృతినాయకు లగుటంజేసియు, శ్రీవారిచే సత్కరింపఁబడు భాగ్యము నాకుఁ గలుగుటంజేసియు నేను కృతార్థుఁడ నైతిని.

నా కావ్య మాంధ్రజనుల యాదరప్రోత్సాహములకుఁ బాత్రము కాఁగల దని విశ్వసించుచున్నాను.

జయపురము,
17–11–1933.

కృతికర్త:
వజ్ఝల వేంకటేశ్వరకవి, బి. ఏ.

# నౌకాభంగము

## కృతిసమర్పణము



లోకేశహరీశ్వరుల్ జగములన్
సృష్టింపఁ బాలింప ను
న్మూలింపంగఁ ద్రిమూర్తులై వెలసి
యెందున్ లీనమై యుండు రా
మూలబ్రహ్మ మనాదినాశము
స్వయంభూతాభ మేలున్ గళా
లోలున్ విక్రమదేవవర్మ
మహీపాలున్ ధర్మశీలున్ సదా.

శ్రీమన్మందవిలోకనమ్మున మృదుస్మేరమ్మునన్ మానసే
చ్ఛామాత్రంబునఁ బ్రాణిఫాలఫలకస్థానంబులం గార్యదీ
క్షామగ్నుండయి తత్తదర్థఫలరేఖల్ వ్రాయు నాబ్రహ్మ స
త్ప్రేమన్ విక్రమదేవవర్మ కొసఁగుఁ దీర్ఘాయురారోగ్యముల్.

కవిరసనాగ్రరంగముల గాయకకంఠములన్ వసించుచున్
శ్రవణమనోహరంబులగు శబ్దములన్ సృజియించి లోకమున్
వివశ మొనర్చు నప్పలుకునెచ్చెలి విక్రమదేవవర్మ పా
ర్థివుని ననేకసత్కృతిపతిం బొనరించుత సత్కృపామతిన్.

వరకృష్ణప్రభుఁడై యనంతఘటికావాసుండునై యేఘనుం [డున్
డురహించుంగమలాన్వితుండతఁడు మన్నున్ సౌఖ్యముల్గూర్చు
సరసాంతఃకరణుండు గానఁ గవిరక్షాదక్షుఁడౌ భూతలే
శ్వరునిన్ విక్రమదేవవర్థనునిన్ సాజాత్యభావంబునన్.

తనశుద్ధాంతము మూయఁగాఁ దెఱవఁగా
ద్వారార్గళం బాత్తకాం
తుని నేత్రద్వితయంబుగాఁగ
మివులన్ శోభిల్లు పద్మాలయా
వనితారత్నము కోమలామల
కృపాపాంగైకవీక్షావళిం
గని శ్రీవిక్రమదేవవర్ధనృపతిన్
గాపాడు నశ్రాంతమున్.

— పాఠాంతరము —

తన శుద్ధాంతము మూయఁగాఁ దెఱవఁగా
ద్వారార్గళం బాత్తకాం
తుని బాహాద్వితయంబుగాఁగ
మివులన్ శోభిల్లు శ్రీభార్గవీ
వనితారత్నము కోమలామల
కృపాపాంగైకవీక్షావళిం
గని శ్రీవిక్రమదేవవర్ధనృపతిన్
గాపాడు నశ్రాంతమున్.

## కృతిసమర్పణము

హిమవత్పర్వతమందుఁ దా మును
తపోవృత్తిం బ్రవర్తించుచోఁ
బ్రమదంబొంది యుమాకుమారి
పరిచర్యల్ సేయఁగాఁ దత్తనూ
శ్రమ వాపన్ నిజశీర్షచంద్రకలఁ
బర్వంజేయు శంభుండు వి
క్రమదేవక్షితిపాలచంద్రమునకున్
గల్గించు నైశ్వర్యముల్.

వలపులు గ్రమ్ముకొన్న
యెలప్రాయపు డెందపుఁదమ్మి నీశ్వరాం
ఘ్రులకు నుపాయనం బొసఁగఁ
గోరి కఠోరతప మ్మొనర్చి కాం
క్షలు ఫలియింప నీశుని
సగమ్ము శరీరముఁ గొన్న సర్వమం
గళ యిడు మంగళమ్ము
లధికమ్ముగ విక్రమదేవవర్మకున్.

ప్రభుసంతానముఁ గావఁగా జయపురిన్ భాసిల్లుచున్నట్టి వ
ల్లభనారాయణదేవుఁడున్ గనకదుర్గాదేవియున్ రాధికా
విభుఁడున్ విక్రమదేవవర్మపృథివీభృన్మౌళికిన్ గూర్తు స
ద్విభవంబుల్ శుభముల్ సుఖానుభవముల్ విస్తారసౌభాగ్యముల్.

జయపూరాజ్యరమాకళత్రుఁ
డఖిలాశాభాసమాన ప్రస
న్నయశోభూషణుఁ డాశ్రితార్థిజన
మందారుండు సంశోధితో
భయభాషావరపండితుండు
కవితావ్యాపారశీలుండు స
త్ప్రియుఁడౌ విక్రమదేవవర్మ
గొనముల్ దెల్పం దరం బేరికిన్ ?

కవియై పండితుఁడై యనేకకృతులన్
గావించి రాజేంద్రుఁడై
కవులన్ బండితులన్ గడున్ దనిపి
తత్కావ్యప్రతానంబులన్
ధవుఁడై కూరిమిఁ బ్రోచి వాఙ్మయము
నత్యంతంబుఁ బోషించు మా
నవముఖ్యుం డల విక్రమాఖ్యుఁడు
జగన్మాన్యుండు సామాన్యుఁడే ?

కృతిభర్తృత్వము, నాటకాదికృతికర్తృత్వమ్ము, భూరిప్రవర్ధితదాతృత్వము, ధారణీవలయనేతృత్వమ్ము, లోకప్రకీర్తితవక్తృత్వము, నిత్యసత్యపథవర్తిత్వమ్ము దీపింప శ్రీయుతుఁడౌ విక్రమదేవవర్మ తగు నాశోద్యద్యశోరాశియై.

## కృతిసమర్పణము

మాన్యుండై చెలువొందు నా ఘనుఁడు
సామాన్యుండు గాఁ, డట్టి రా
జన్యగ్రామణి సుప్రసన్న
వదనాబ్జాతమ్ము దర్శించి సౌ
జన్యంబొప్ప నెవండు తద్విభుని
సత్సంభాషణంబున్ వినున్
ధన్యుం డాతఁడ, వాని జీవితము
సార్థక్యంబునన్ మించుఁబో.

కవితల్ నేర్చినయందుకున్ ఫలముగాఁ గావ్యంబు నిర్మించి ధీ
రవరేణ్యుండు రసజ్ఞుఁ డుత్తమజనారాధ్యుండు నైనట్టి పా
ర్థివచూడామణి కంకితంబుగ సమర్పింపన్ సమర్థుం డెవం
డవు నవ్వాని యదృష్టవైభవము నేలా వేఱ వర్ణింపఁగన్ ?

కావున నియ్యెడ నభినవ
భావాన్విత మగు నొకకృతి వ్రాసి యొసంగం
గావలదె యంకితంబుగ
శ్రీవిక్రమదేవవర్మనృపచంద్రునకున్ ?

అతఁ డెన్నం గవితారసానుభవలీలాభిజ్ఞుఁ డౌఁ గాన మ
త్కృతికన్యామణి నాదరించి మధురప్రేమాన్వితస్వాంతుఁడై
యతిహర్షంబున స్వీకరించు నని నాయాత్మన్ విచారించి వ్రా
సితి నే నొక్కకృతిన్ గుతూహలమతిన్ శీఘ్రంబ వాణీకృపన్.

## ఆశాభంగము

తీవకన్నెల కావిమోవి లేనవ్వు లా
మోదవికాసముల్ పూనువేళ,
తేనియల్ చవిఁగొన్న తేఁటిమొత్తములు మం
గళవాద్యఘోషముల్ సలుపువేళ,
చలువందనమ్ముల మొలకతెమ్మెరలు క
ళ్యాణసల్లాపముల్ పలుకువేళ,
నవసుధామధురకంఠమునఁ బైకము శుభా
శీర్వాదనాదముల్ చేయువేళ,

భాసురమ్మగు శ్రీముఖవత్సరాది
దివసమునఁ బ్రేమమీఱ మత్కృతికుమారిఁ
గైకొనియె నన్ను ధన్యునిఁగా నొనర్చి
ధీరవరుఁడు శ్రీవిక్రమదేవవర్మ.

మత్కృతికన్యకామణికి
మంగళధాముఁడు సంస్కృతాంధ్రహిం
ద్యుత్కళహూణవాఙ్మయము
లొక్కట నేర్చిన పండితుండు వి
ద్వత్కవిలోకపోషణుఁ
డుదారుఁడు విక్రమదేవవర్మ భూ
భృత్కులమౌళి భర్తగ
లభించె నదేమి యదృష్టమోకదా!

లోకానస్తోకతమోవిదారకశుభాలోకంబునం జక్ర ర
క్షాకౌశల్యమునం బ్రతాపగరిమన్ సన్మార్గసంచారదీ
క్షాకేళిన్ ద్విజరాజసఖ్యమున భాస్వత్కీర్తి వెల్గొందు భ
ద్రాకారుం డినవంశభూషణుఁడునై యావిక్రమార్యుం డిలన్.

అకలంకంబగు భాస్కరాన్వయమునం దావిర్భవంబంది స
ర్వకళాసంకలితుండు మున్ జయపురీరాజ్యంబు నేలెన్ వినా
యక దేవుండు; తదీయసంతతిభవుండై నేఁడు తద్రాజ్య ము
త్సుకతన్ లోకము మెచ్చఁ బాలన మొనర్చున్ విక్రముండున్నతిన్.

అరిలోకభీకరుం డాదివిక్రమదేవ
ధాత్రీశుఁ డెవ్వాని తాతతాత,
వీరాధివీరాదిబిరుదాంకరామచం
ద్రప్రభుం డెవ్వాని తాతతండ్రి,
శ్రీయుక్తుఁడైన ద్వితీయవిక్రమదేవ
ధరణీంద్రుఁ డెవ్వాని తండ్రితండ్రి,
శివభక్తియుతుఁడు కేశవభక్తియుతుఁడు శ్రీ
కృష్ణచంద్రప్రభుం డెవని తండ్రి,

యతఁడు వొగడొందుచుండు నిజాన్వవాయ
పూర్వరాట్సర్వసద్గుణభూషితుండు,
మహితజయపురరాజ్యరమావిభుండు,
ధృతసుకృతవర్త విక్రమదేవవర్త.

రేఖాదేవికిఁ గృష్ణచంద్రునకుఁ
జేర్తింగూర్చు సత్పుత్త్రుఁడై
క్ష్మాఖండాధిపతిత్వమొంది
శ్రితసంఘాతంబులన్ దేవతా
శాఖింబోలి యజస్రమున్ మనుచుచున్
సత్కార్యముల్ సేయుచున్
లేఖేంద్రోపమవైభవంబునఁ
దగున్ శ్రీవిక్రముం డున్నతిన్.

కవికి జీవనమిచ్చు ఘనుని దార్తవము, యీ
తని దనార్తవమైన దానవిరతి;
సుమనోవనుఁడగు రాజుది సకలంక, మీ
తని దకలంకమౌ ధవళకీర్తి;
ఘనరసావహుఁ డహీనునిది విషాప్త, మీ
తనిది సామృతవాక్కు తనరు జిహ్వ;
సన్మార్గి యినునిది సంగతగ్రహణ, మీ
తని దప్రతిహతప్రతాపశోభ;

అనుచు జగములు నిరతంబు వినుతిసేయు
మహితజయపురరాజ్యరమాకళత్రు,
దీనమందారు విక్రమదేవవర్మఁ
బోలఁగల రాజు లెవ్వ రిప్పుడమియందు ?

## కృతిసమర్పణము

రాజ్యనిర్వహణధూర్వహతా ప్రవీణుండు
మహితపుల్లారెడ్డి మంత్రివరుఁడు,
కృతకృత్యుఁ డాంతరంగిక కార్యదర్శి శ్రీ
సెట్టి లక్ష్మీనరసింహాసుకవి,
సంగీతసాహిత్యసరసకవిత్వాది
సత్కళానిధులైన చతురమతులు,
అసమానరాజభక్త్యావేశసంతత
ద్యోతమానాత్ము లుద్యోగిజనులు,

కరముఁ గొలువంగఁ బేరోలగంబుఁ దీర్చి
సరసవచనప్రసంగముల్ నెఱపి ప్రొద్దు
పుచ్చు నిరతంబు లోకంబు మెచ్చుకొనఁగ
ధృతసుకృతవర్మ విక్రమదేవవర్మ.

మును శీతాంశుకులంబునందుఁ
బ్రభవంబుం బొంది శ్రీకృష్ణరా
యనృపాలప్రవరుండు, నేఁడు
జలజాతాప్తాన్వవాయంబునన్
జననంబుంగని విక్రమాఖ్య
ధరణీనాథుండు. భాషాప్రవ
ర్ధనులై కూర్చిరి రెండువంశముల
కుద్యత్కీర్తిసౌభాగ్యముల్.

వేలకొలందిగాఁగ నుడివెన్
　　　　కృతిరత్నము లుత్కళాంధ్రముల్,
చాలుననంగ లక్షలకొలంది
　　　　ధనం బిడె నాంధ్రవిశ్వవి
ద్యాలయసంస్థకున్, మనిచె
　　　　నార్తుల యాచకులం గవీంద్రులన్
లాలన మొప్పఁ గోటులకొలందిగ
　　　　విక్రమభూపుఁ డెన్నఁగన్.

శ్రేయస్సంకలితంబుగా
　　　　బుధకవిశ్రేణీస్తవార్హంబుగా
నాయుర్వేధవుఁ డాత్తపత్తనమునం
　　　　దత్యంతవిశ్రాణన
శ్రీయుక్తిన్ దసరామహోత్సవముల్
　　　　జేయించుచోఁ దద్యశ
శ్ఛాయావ్యాప్తులఁ దెల్లఁబోవు
　　　　నలనక్షత్రేశబింబాభ్రముల్.

జ్యోతిశ్శాస్త్రవిశారదుండు మహితాయుర్వేదవేత్తృత్వవి
ఖ్యాతుం డాగమధర్మనిర్వహణదీక్షాసక్తచిత్తుండు వి
జ్ఞాతానేకపురాణవిశ్రుతవచస్సారుండు విష్ణీశ్వర
ధ్యాతృత్వాంచితుఁ డమ్మహీవిభుఁడు దీర్ఘాయుష్కుఁడై వర్ధిలున్

కృతిసమర్పణము

ఏవాని చతురాస్యతా వైఖరికి మెచ్చి
వరియించెఁ దొలుదొల్త వాగ్వధూటి,
ఎవ్వాని గుణరూప వృత్తంబులకు మెచ్చి
రక్తిఁ బెండ్లాడె హీరాలతాంగి,
ఎవ్వాని భూరిదాతృత్వంబునకు మెచ్చి
కామించెఁ గీర్తికాంతామతల్లి,
ఎవని గోత్రోద్ధరణవిధంబునకు మెచ్చి
చేపట్టె రాజ్యలక్ష్మీ పురంధ్రి,

అతఁడు వలచివచ్చిన నాదు కృతికుమారిఁ
గూడఁగైకొన్న విక్రమక్షోణివిభుఁడు
ప్రజలు సుఖియింప విబుధులు ప్రస్తుతింప
నవనిఁ బాలించి చిరకాల మలరుఁ గాక.

*

# నౌకాభంగము: ౧

## ప్రేమలీల

పిఱుఁదులపైని ప్రేలి ముడివీడిన పెన్నెఱివేణి పిల్లతె
మ్మెరలకు నల్లలాడఁగ, భ్రమించినకన్నుల సోగకోరికల్
తరళరుచిన్ వెలుంగఁగఁ, బదమ్ములు దొట్రిలఁ, మోహనాకృతిన్
బరుగిడుచుండెఁ జక్కనగుబాల యొకర్తుక పల్లవొల్లనన్.

చివురుపాదాలు మార్దవశ్రీలు చెదర
నిసుకలో దిగఁబడిపోవు టెఱుఁగకుండ
నెవరికొఱకో ప్రణయదీప్తి రవులుకొనఁగఁ
బరుగులిడుచుండెఁ బాప మాబాల యపుడు.

హేమసవర్ణదేహముపయిన్ నవసాంధ్యవిభాకరప్రభా
శ్రీ మెఱుఁగొందఁ, జెక్కిళుల స్వేదకణమ్ములు జాఱ, మిత్రులన్
బ్రేమమయాత్ములన్ దలఁచి వేసటఁజెందుచు విశ్రమించె నా
కోమలి వాడి సోయగముఁ గోల్పడినట్టి సుమమ్ముపోలికన్.

జలనిధిగంభీరారవ
విలీనమగు నొక్కపిలుపు వినఁబడెఁ "జెలియా
చెలియా" యని: స్ఫురియించెం
గళావికాసంబు బాలికావదనమునన్.

సఖులఁ గనినంత నామె విషాదమెల్ల
మఱచిపోయె నొకముహూర్తమాత్రమందె ;
నయనకళ మాఱెను ; క్షణక్షణపరిణామ
యోగ్యములు గావె బాలభావోదయములు.

క్షణములో మాఱు ఖేదాశ్రుకణము లెల్లఁ
గమ్రమోదాశ్రుకణములుగాఁగ, నేడ్పు
లేనగవుగా, వికారంబు లేని లేఁత
యెడఁదకు నిసర్గగుణం బిదియ కాదె ?

మువ్వురును స్నేహ భావంబు మురిసిపోవ
నొకరొకరి భుజమ్ములఁ జేతు లుంచుకొనిరి ;
ప్రియసఖులమధ్యమునఁ గుమారీమతల్లి
తేజరిల్లెను సౌందర్యదేవతవలె.

వార్ధితటమున నటునిటుఁ బరుగులిడుచు
వారు క్రీడించుచుందురు ప్రతిదినంబు
నందు ; నెగసెడు కెరటాలయందు వారి
ముద్దుటడుగులు మాయమైపోవుచుండు.

ఆ సాముద్రతటప్రదేశములు నిత్యావాసముల్ గాఁగ వీ
చీసౌభాగ్యములన్ గనుంగొని సుఖశ్రీలన్ వినోదించు స్వే
చ్ఛాసంతానమ మైన వారి విమలస్వాంతంబు లానందకే
ళీసామ్రాజ్యపదప్రసక్తి నెఱుఁగన్ లే వన్యభావంబులన్.

ఒకనాఁటి నాక్రిస్సైకతసమున్నతసౌధముల౯ స్పృశించుచున్
వికలములై పయోధిభవవీచికలను గలియన్ వినోదభా
వకలితవృత్తిఁ గన్గొనుచు వారు హసింతు ; రెసంగు నేదియో
ప్రకృతిరహస్య మా విమలబాలవయఃపరిఖేలనంబులన్.

వేడుక నాశ్రయం బనుభవించుచు నొక్కొకవేళయందు వా
రాడుచునుందు రచ్చటటి వనాంతరసీమ గృహస్థధర్మస
త్క్రీడ, నొకప్పు సుందరుఁడు గేహి, కుమారుఁ డొకప్పు గేహిగాఁ,
జేడియ గేహినీపదవిఁ జేకొన ; నిట్టివ బాల్యసౌఖ్యముల్.

ఆటలో గృహయాజమాన్యంబుకొఱకు
నొకొకతఱి సుందరకుమారులు కలహింతు
రేని " నే నాలి నయ్యెద నిరువుర " కని
మధురముగఁ బల్కి జగడంబు మాన్పు నీల.

తూరుపుదిక్కునన్ బృథులతోయధి, పశ్చిమదిక్కునందు శృం
గారవనంబు, చక్కనగు గట్టులు ప్రక్కలఁ, గల్గు పల్లియన్
వారు వసించి యాచిఱుతప్రాయమునన్ సుఖియింతు రెంతయున్
గోరిక లేని చిత్తముల కూరిమి పెంపున నాటలాడుచున్.

కాఁపుకొలమ్మున౯ ధనము గౌరవమున్ గల తండ్రి కొక్కరుం
డై పరమప్రమోదకరుఁడై సుతుఁడైన కుమారుఁ గూడి మా
తాపితృశూన్యతన్ సమతఁ దాల్చిన నీలయు సుందరుండుఁ గే
ళీపరిలబ్ధమైత్రి సుఖలీల వహించి వసింతు రచ్చట౯.

అరిగెఁ గొంతకాలమ్ము ; బాల్యప్రభాత
చిహ్నములు మెలమెల్లఁ గృశించిపోవ
యౌవనప్రాయసూర్యోదయారుణిమ యు
పుషు పొడమె స్నేహమూర్తుల మువ్వురందు.

ఎడఁదలోఁ డాఁగి యొరులకు నెఱుఁగరాని
వాకుమారు రహఃప్రణయమ్ములెల్ల ;
విడివడని సిగ్గుమొగ్గల నడఁగియున్న
వలపులవి మధురంబులు పావనములు.

హృదయమున నిండి యుప్పొంగి యెగసి బయలు
వాఱినవి సుందరుని శుభ ప్రణయరుచులు ;
విరిసినట్టి ప్రసూనంబు వెలువరించు
పరిమళమ్ములు పరమపావనము లవ్వి.

పరిణతమానసాంతరనిబద్ధదృఢప్రణయమ్ము లెల్ల నొం
డొరులకు వెల్లడించుకొనియుండిన నీలయు సుందరుండుఁ బో
యిరి యొకనాఁటి సంజతఱి హెచ్చినవేడుకమై మనోజ్ఞసుం
దరవనవాటికాంతరమునన్ విహరింపఁగఁ గోర్కె పుట్టఁగన్.

చక్కగా వికసించిన జంటపూలఁ,
జెట్టుపైఁ గూరుచుండిన పిట్టలజత,
స్నేహమున జోడుగా నేగు చెలినిఁ జెలువుఁ,
బ్రకృతిమాతయు కాంచి పెంచుకొనె నేమొ.

ఏకాంతంబున నావనంబున విహారేచ్ఛన్ వినోదించు నీ
లాకాంతామణి, సుందరుండు, ననుకూలప్రేమఁ గ్రీడింప, "వీ
ర్నాకున్ బిడ్డ"లటంచుఁ దాఁ బ్రకృతి యానందంబునం బల్కిన
ట్లేకుంజంబుననో ఱొనర్చెను బికం బెంపార కుహూకారమున్.

ఈసుమమ్ములు నీ నవ్వులే యటంచు,
నీవిరులు నీదు నునుఁజెక్కులే యటంచు,
నీపువుల్ నీ వలపుఁజూపులే యటంచు,
సూనములు గోసె నీలకై సుందరుండు.

ఒండొరుల భుజంబులపయి నొండొరుల క
రంబు లిడుకొని యుప్పొంగు ప్రణయలీల
నొండొరులఁ జూచుకొనుచుఁ గూర్చుండి రచట
నొక్క తాతిన్నెపయిఁ జెలియును జెలువుఁడు.

చెలువు చెక్కునఁ జక్కిలి సేర్చి గళము
చుట్టుఁ గేల్దోయి పెనవైచి చూచెఁ జెలువ;
చెలువ బుజమున నొకచేయి నిలిపి మఱొక
చేత ముంగురుల్ దద్ది హాసించె నతఁడు.

ఆ కల్యాణమహోత్సవం బయిన సాయంకాలమందున్ ద్విజా
నీకంబుల్ మృదుమోహనస్వనము రాణింపన్ శుభాశీర్వచ
శ్లోకంబుల్ పఠియించె; నవ్యసుమనస్స్తోమంబులన్ రమ్యవ
ల్లీకాంతామణు లెల్లఁ జల్లిరి సిరుల్ పెంపొందు కేళీవనిన్.

అలరుఁబడుచుల వలపుల నపహరించు
పవనుని రహస్యరాగసంభాషణములు,
పూవుజవరాండ్ర తీయని మోవితేనెఁ
ద్రావు భృంగకుమారుని ప్రణయగీతి,

వినఁబడెనో లేదొ యా సాంధ్యవేళయందు
దృఢపరిష్వంగసుఖమునఁ దేలి మేను
మఱచి యే దేవతాలోకమార్గముననో
క్రీడఁ గావించుచున్న సఖీసఖులకు.

అమృతోద్వాహశుభసమయంబునందుఁ
దనవలెనె రాగ మభ్యసించిన వినూత్న
దంపతుల పరమప్రమోదంబు నరసి
తాను నానంద మొందె సంధ్యాకుమారి.

రోగియై యింటనున్న గురునకు నాఁడు
సేవ లొనరించి కడు నాలసించినట్టి
యాకుమారుఁడు తనదు నెయ్యంపు సఖుని
సఖినిఁ గనుఁగొనఁ బరుగునఁ జనియె నపుడు.

తలఁపుల్ సంభ్రమితంబులై కలఁతనొందన్, వెల్వెలంబోవు చూ
పులు తృష్ణంగొనిదిక్కులన్ బరుగిడన్, మోమందు శుష్కించునా
శలు నర్తింపఁ, గుమారుఁ డబ్ధిసికతాస్థానంబులం దొక్కచో
నిలువన్ లేక చరించె సుందరునికై నీలాలతాతన్వికై.

నీలాసుందరవదన స
మాలోకకుతూహలాత్తుఁ డగు నతఁ డటుఁ
గేళీపరిచితమగు నొక
శైల మధిష్ఠించె నధికసంరంభమునన్.

ఆయెడ వారలఁ గనియె నాతఁడు దూరమునందు: యౌవన
ప్రాయమునన్ బ్రియాప్రియపరస్పరసౌఖ్యవిభూతి కాద్యమౌ
నాయువతీమనోహరసుఖానుభవం బెటువంటి దౌనొ? ని
ర్మాయికముల్ మరందమధురమ్ములు వారి దృఢానురాగముల్.

అతని కన్నుల, నతని యాస్యంబునందు,
భావచాంచల్య మొకమాఱు ప్రకటమయ్యె;
వారి మోములఁ దిలకించి వారి తరళ
దృష్టులందునె తన వ్రాఁతఁ దెలిసికొనియె.

ఆఁపుకొనలేని గాఢసంతాపభరము
వలనఁ గనులంట జాఱిన బాష్పజలము,
చెక్కిళులయందుఁ గ్రమ్మిన స్వేదజలము,
మైత్రిఁ గావించెఁ దన్ముఖమండలమున.

ఆ కుమారుని మృదుహృదయమున మున్న
కలదు నీలాకుమారికై గాఢనిర్మ
లానురాగంబు; కల దిపు డదియు కాక
తెగని జీవితపర్యంతతృష్ణకూడ.

ఆ వనాంతరప్రణయ దృశ్యంబుఁ గాంచి
యోర్వఁగాలేక య తఁడు నిట్టూర్పు విడిచె ;
హృదయమున   పని దృఢప్రేమ దాఁచు
కొని బ్రదికినన్నినా ళ్లోర్చుకొనుట యెట్లు ?

పరజనాజ్ఞాతమై లోనె ప్రబలునట్టి
హృదయవేదనాభారంబు మ్రింగికొనుచుఁ,
గడచిపోయిన జీవితగాథ లెల్ల
హృదయమంద యొక్కొకమాఱు చదువుకొనుచు,

మూఁగ యైనట్టి తన యను రాగగీత
మంధకారాన లీనత నందనిచ్చి
క్రూర మైనట్టి స్నేహంబు రోసి యాతఁ
డేవిధంబున నిలుపునో జీవితాశ ?

ఆఁగని విషాదమో, కనులందు నుండఁ
బోని బాష్పజలంబొ, యోహ్వానని మృదు
హృదయమో,   కడలేని పదయుగంబొ
యా కుమారుఁ   నిపోయె నచటినుండి.

*

# నౌకాభంగము : ౨

## ఎడఁబాటు

క్రేవలఁ గల్గు వృక్షముల క్రింద సగమ్ముగఁ దోఁచునట్టి ఛా
యావరణంబు, భానుకిరణారుణకోమలబాలకాంతిరే
ఖావిభవంబు, నెట్టెదుటఁ గన్నులపండువు సేయ హాసముల్
ప్రోవులుగాఁగ నించె నను మోవిఁ గుమారి యొకర్తు వేడుకన్.

ఆయయిదేండ్ల కన్నె తనయంకమునందు వసించియుండ బా
లాయని పిల్చి చెక్కిళుల సల్లన వ్రేళులు సేర్చి నొక్కుచుఁ
దీయనిముద్దొసంగె నెదనిండిన వేడుకతోడ సుందరుం;
డాయనుకూలసంసృతిసుఖానుభవమ్మున కేది కూలమో.

రమ్యమగు పూరియింటి ద్వారమ్మునొద్ద
నీల పాలిచ్చుచుండె హస్తాలలోని
చిన్నిసుతునకుఁ; గడుపారఁ గన్నతల్లి
ప్రేమకును సాటి యెయ్యది ప్రేమలందు?

నిత్యసౌఖ్యపరంపరాన్వీత మా కు
టుంబమం దొక్క తెప్పపాటుననె స్వప్న
వృత్తివలె నెన్నిగడియలో యెన్నినాళ్లో
యెన్నిమాసంబులో యెన్ని యేండ్లో చనియె.

అంతదూరానఁ దనరాక నరసి పరుగు
పరుగునం బోయి మోమెత్తి పల్కరించి
చేతులం జాఁచి కౌఁగిటఁ జేర్చు పుత్త్రి
తండ్రి కిడు హాయి నిత్యనూతనము గాదె?

జలధియాత్రాపరత్వంబె సంతతంబు
జీవయాత్రాస్వరూపంబుఁ జెంద సుంద
రుండు గ్రామసమీపభూమండలమున
మంచివాఁ డను పేరు నార్జించినాఁడు.

నావికాగ్రణి యగు తననాథుఁ గాంచి
మురిసిపోవుచు నిత్యప్రమోదశోభ
లను బ్రకాశించునట్టి నీలాకుమారి
యెడఁదలోనఁ దమోలేశ మేని లేదు.

ఆయర్ధాంగిప్రియుం డొకొక్కయెడలన్ వ్యాపారముల్ పూని నౌ
కాయాత్రల్ పొనరించువేళల వియోగక్లేశతామిస్రముల్
మాయమ్మా నిజనందనాననవిలోలస్పందమందస్మిత
చ్ఛాయాసంతతులందు నామె విమలస్వాంతంబు శాంతింగొనన్.

ఆకుమారీకుమారుల యంద మెల్లఁ
జూచుకొని "తలిదండ్రులు నోఁచుకోని
చదువు వీరికి భావిసంపద" యటంచుఁ
దనదు ప్రియురాలితోడ సుందరుఁడు వలుకు.

ఒకటిగా నెన్నఁబడు మహాప్రకృతియందు
నెన్నఁడును బరిణామ మూహింపరాదు;
భిన్నభిన్నంబు లయిన సద్వృత్తులందు
మాఱుపు ఘటిల్లుచుండు సాధారణముగ.

ఆ నీలాలలనాలలామ మొకసంధ్యావేళ దూరస్థితంబౌ నౌకాశ్రయసీమ కేగిన స్వకీయాత్మాధినాథుండు తే పోనేఁడో యరుదెంచువాఁ డనుచు సత్యుత్సాహభావంబునఁ దా నుండెఁ దనచిన్నినందనునిఁ జేకొందీసి ముద్దాడుచున్.

ఆయెడ నశ్వారూఢుం
డై యొకపురుషుండు వచ్చి యట నెఱిఁగించెఁ
నాయకుఁ గూర్చిన విషయము
లాయువతికి నెద విషాద మలముకొనంగన్.

అట నౌకాశ్రయమందు నాయకుఁడు శయ్యాధీనుఁడై దైవసంఘటనన్ గార్శ్యముఁగొన్న దేహమునరోగగ్రస్తుఁడైయున్నవాఁడఁట, భవ్యౌషధసేవఁ జేసి పరిపూర్ణారోగ్యముం గాంచునంతట గేహంబునకేగుదెంచునఁట, యెన్నాళ్లోర్చుటో, యేమియో?

"ఏడేఁడుల్ వడిగా గతించినవి యెంతే సౌఖ్య మేపార; నీ
నాఁ డాత్మేశుఁడు రోగసంకలితుఁడై నౌకాశ్రయంబందు ను
న్నాఁ; డేకై వడి నివ్యోడన్ దినములన్ సాగించుదానన్? మనః
పీడం గుందుచు దుర్వియోగము ననున్ వేధింప నెట్లోర్తునో?"

అనుచు దుఃఖించి విలపించు నహరహంబు
“ ప్రాణనాథుని సేవించు భాగ్యమునకు
నకట నోఁచుకో నయితి ” నటంచుఁ గుందు
నాత్మలోనను నిండుచూలాలు నీల.

పండువసేయు పుత్త్రు ముఖపద్మముఁ గన్నప్రతిక్షణంబు “ నె
న్నండరుదెంచునో వెతలునాశనమొందఁగఁదండ్రి” యంచుఁదా
మెండుగఁ దత్కపోలములమీఁదను ముద్దులఁబెట్టు నానెలల్
నిండిన కోమలాంగికి జనించె సుతుం డొకనాఁటి వేకువన్.

ఆకాశంబున నావరించినవి నవ్యాసారపద్వారిదా
నీకంబుల్ ; హృదయాంతరాళమున నన్నీలాలతాతన్వికిన్
శోకావేగము సంచరించినది యశ్రుల్ జాలుగాఁ గ్రమ్మ వీ
క్షాకోణంబుల, దుర్బలాత్మభవునిన్ గన్గొన్న యప్పట్టునన్.

స్వప్రేమామృత మిచ్చి నిశ్చలమనస్సర్వస్వ మర్పించి పం
చప్రాణంబులు వెట్టి దుర్బలముగా జన్మంబుఁ గన్నట్టి యు
ల్పప్రాయంపుఁ గుమారు నన్నెలఁత పెంపన్ సాగె నారోగ్యభా
గ్యప్రాప్తిన్ విభుఁడేగుదెంచు నెపుడో యంచున్ విచారించుచున్.

అట నాకాశ్రయమందు సుందరుఁడు దేహారోగ్యభాగ్యంబు వి
స్ఫుటమై యంతకునంతకున్ దినదినంబున్ వర్ధమానంబుగాఁ
బటుచింతాన్వితుఁడయ్యె నయ్యెడఁ బ్రియాపత్యంబులం గాంచు టె
న్నఁటికిన్ గల్గెడినో యటంచ తనిస్వాంతం బాత్రముం జెందఁగన్.

"వ్యాపారంబు వినష్టమై చెడిన దన్యాక్రాంతమై ; యింట భా
ర్యాపుత్త్రాదిక మెట్టికష్టములపాలై యున్నదో" యంచు సం
తాపం బందుచునుండు సుందరుఁ డెదన్ నౌకాశ్రయావాసియై
యాపద్బాంధవుఁడౌ పరాత్పరుఁ గడుం బ్రార్థించుచున్ నిత్యమున్

ఆయార్తుండగు నావికుండు నిజకాంతావస్థఁ జిత్తంబునం
దే యూహించుచు నెన్ని యోగతుల, "నాకేమైన రానిమ్ము స్వా
మీ, యవ్యాజకృపాకటాక్షకలనన్ వీక్షించి రక్షింపుమా
నాయాల్బిడ్డల" నంచొనర్చు నెపుడున్ సర్వేశ్వరధ్యానమున్.

"నావికశేఖరుం డని ఘనంబగుపేరు వహించినట్టి స
ద్భావుఁడు సుందరుం ; డిపుడతండు కడున్ దురదృష్టవంతుఁడై
దైవవశంబునం బొగులుఁ దా నకటా, మును పొక్కయప్డు నా
సేవకుఁ" డంచు జాలిఁదలఁచెం గరుణామయుఁ డొక్కఁ డత్తఱిన్.

నౌకానాయకుఁడై యెసంగునతఁ డంతన్ సుందరుం జేరి యి
ట్లేకాంతంబునఁ బల్కె: "నియ్యెడల నోయీ నీదుసాహాయ్యమే
నాకాంక్షించెద ; దూరదేశగతి సేయంబోవు నాయోడకే
పేకున్ రాఁదగు శంక లేక ; యటుపై నిం గల్గుమాంగళ్యముల్."

"నాకావించిన ప్రార్థనం బిపుడు విన్నాఁ డాదయారాశి యా
లోకాధీశ్వరుఁ" డంచు సుందరుఁడు లోలో నబ్బురంబొంది యం
గీకారంబు నొసంగె మోదభరయుక్తిన్ దూరదేశైకయా
త్రాకార్యం బొనరింప డెందమున సంరంభం బమందంబుగన్.

క్రమ్మిన చిన్నిమబ్బు వడిగా విడిపోయినయంత భానుతే
జమ్ములు వెల్గిపోవుఁగద చాయలు దూరముగాఁ జనంగ ; స్వాం
తమ్మున నావరించు కలఁతల్ తొలఁగన్ దురదృష్టమెల్ల న
ష్టమ్ముగఁ బూర్వశోభలు పొసంగిన నాతని నెమ్మొగమ్మునన్.

“ఈసంసారపయోధి దాఁటుటకు నా కేనాఁటికింగూడ నా
కాసాహాయ్యమె మేలు, జీవితమునన్ గళ్యాణసౌభాగ్యముల్
కై సేయంగల , దన్యదేశముల కుల్లాసంబునన్ యానమున్
నేసాగించెద, నేగుదెంచెద ధనాన్వితుండనై యింటికిన్.

“అకటా, నాసఖి ! తన్సుఖంబుఁగనఁగా నాసించుఁగన్దోయి—ము
ద్దుకుమారీమణి ! యామెనెత్తుకొన నెంతోతృష్ణఁ గైకొన్న వి
స్ఫురకరంబుల్—మురిపెంపుబాలుఁ!డతనిన్ ముద్దాడఁగా నేఁడు మో
వి కడుంగోరెడు—నెట్టులుందురొకదా వీరింక నేనేగుచోన్ !

“ప్రేమసుధారసం బలవరించిన భావిదినంబులెల్ల నెం
తే మధురంబులై యతిశయింపఁగ బిడ్డల నాలిఁ గూడి స్వ
గ్రామమునన్ సుఖించెదఁ గొఱంతలులేక యితోధికంబుగా
మామకశేషజీవితసమస్తము సౌఖ్యసమన్వితంబుగన్.”

ఊహాధ్వంబుల భావిజీవితకథావ్యూహంబు లీలీల ను
త్సాహం బేర్పడ నిశ్చితైకగతి సంచారంబుఁ గావింపఁగా
దేహారోగ్యము నాఁడునాఁటి కభివృద్ధిం బొంది దీపింపఁగా
గేహాలోకనతత్పరాత్మత నెసంగెన్ సుందరుం డయ్యెడన్.

అది మనోహరభానూదయమ్ము ; నాఁడు
గృహమునకు సుందరుండు వోయిన దినమ్ము ;
నళిని నెమ్మోము నిర్భరానంద మొసవ
విరిసినది చిఱునవ్వుల వెలుఁగుతోడ.

ఇంటి గుమ్మముకడ వసియించి తనదు
నీరసపుఁ జిన్నికొమరుని నీల మృదుళ
హస్తయుగమునఁ దీసి ముద్దాడి యంత
నెదపయిం జేరిచికొని పాలిచ్చుచుండె.

వచ్చియును రాని మాటల నుచ్చరించి
ముచ్చటం గొల్పు రెండేండ్ల ముద్దుపట్టి
మచ్చిక జనింపఁగా నక్క మెచ్చికొనఁగ
నచ్చటనె హెచ్చుగా నాటలాడుచుండె.

నీలాసుందరి దవ్వులందుఁ బ్రియునిన్ వీక్షించి యవ్వేళ ను
ద్వేలత్వమ్మున భావవీచికల నెంతేఁ జిత్త ముప్పొంగఁగాఁ
గేలన్ బాలునిఁ దాల్చి లేచి యెదురేగెన్ గంఠసద్యోవిము
క్తాలాపంబు సెలంగఁగా మధురమై యానందవిస్ఫారమై.

ఎదపయిఁ గల్గు పయ్యెద యొకింత తొలంగఁగ, సంభ్రమమ్మునన్
బదములు తొట్రుపాటుఁగొన, బాష్పకణంబులు లోచనంబులం
దొదవఁగ, నొక్కటొక్కటిగ నూర్పులు మోమున నిర్గమింపఁగా,
హృదయము స్పందనంబుఁగన, నింతి ప్రియాభిముఖంబుగాఁ జనెన్.

మూఁగతనమ్ము మిక్కిలిగఁ బొందిన కంఠయుగమ్ము, గాఢసం
యోగముఁగొన్న కన్గవల నూరిన వాఃకణముల్, కరద్వయ
త్యాగమునన్ గరద్వయమునందిన యర్భకరత్న, మాత్మనా
థాగతియున్ సఖిప్రియసమాదృతియుక్ గడు దర్శనీయముల్.

చేతులలోనఁ దీసికొని
చిన్నికుమారునిఁ గాంచినాఁ డతం;
డా తొలిచూపునం బితృహృ
దంతరజన్యములై సుధారస
శ్రీతులితంబులై ప్రకృతి
సిద్ధములై తొలుకాడు ప్రేమముల్
ద్యోతితమయ్యె నశ్రుసలి
లోరుకణప్రతిబింబితక్రియన్.

అంగములన్ స్పృశించి తను వల్లనఁ జేతులఁ జేరఁదీసి క
న్నుంగవలోని యందముఁ గనుంగొని చక్కనిచెక్కులందు హ
స్తాంగుళు లుంచి లేఁతచివురాకులఁ బోలిన మోవి చుంబనం
బుంగొనెఁ జిన్నిపుత్త్రు నెడ మోహముఁ గాంచిన తండ్రి యయ్యెడన్.

సుందరుఁడు మఱునాఁడు తీయందనములు
నెగడు మాటల నిజమనోనిశ్చయమ్ము
భావినౌకాప్రయాణవార్తావిశేష
మెఱుకపడ నీలకున్ వచియించినాఁడు.

అతని భావిసముద్ర ప్రయాణవార్త
శ్రవణయుగళంబు సోఁకిన సమయమందు
నీల హృదయంబు భావకల్లోలమాలి
కాక్షుభితమయ్యె ఘోరసాగరమురీతి.

ఎన్నిసారులు విభుఁడు మున్నేగలేదు?
తిరిగి మంగళయుక్తి నేతేరలేదు?
కాని యిప్పుడు తద్వియోగమ్ముఁ దలఁచి
యెడఁదలో నీల కుందఁగా నేమికతము?

ఆ దినావసానమ్మున నాకసమున
నలముకొన మొదలిడినవి జలధరములు;
నిర్మలంబైన యెసంగు నన్నీలయెడఁద
నావరింపఁగ మొదలిడినవి కలఁతలు.

నీలనభోవితానమున
నీరదముల్ నటనం బొనర్పఁగా
బాలశశాంకరేఖ కను
పట్టిన దున్నత ఘోరసాగరా
లోలతరంగమాలికలలోనఁ
బ్రమాదవశంబునన్ గడున్
దూలుచుఁ బోవు నౌకగతిఁ
దోఁచుచు నారజనీముఖంబునన్.

గళమున మంజుబాహులతికల్
పెనవైచి కవుంగిలించుఁ, గ
న్నుల హృదయమ్ములోనికిఁ గనన్
మొగ మించుక నొక్కి దైన్యముల్
మెలఁగిన చూపులన్, బెదవిమీఁద
విషాదపరీతచుంబనం
బుల నిడు, మాటలాడకయ
ముద్దియ భావ మెఱుంగఁ జేయుచున్.

చిమ్మచీఁకటిరేయి జీవితమ్మనునట్లు
కబరీభరమున మొగమ్ముఁ గప్పెఁ;
బటువియోగాగ్నితప్తము ప్రాణ మనునట్లు
కెమ్మోవి ముద్దులఁ గ్రుమ్మరించు;
ఘనశోకవార్ధిమగ్నము డెంద మనునట్లు
కన్నీటఁ జరణయుగంబుఁ దడుపు;
హింసాతికఠినమ్ము సంసార మనునట్లు
గట్టిగా నెమ్మేనిఁ గౌఁగిలించు;

వాని నౌకాప్రయాణమ్మువలన మిగులఁ
గీడు మూఁడు నటం చెఱిఁగించునట్లు
దీనముగఁ జూచుఁ బవలు రాత్రి యనకుండఁ
బ్రాణకాంతుని దరిఁ జేరి యా యొయారి.

"భవదంకపర్యంకవాసంబునకు నెంత
వాఁచిపోవునో కదా పాలపాప;
త్వత్ప్రేమమధురచుంబనసౌఖ్యమున కెంత
మోహ మొందునో కదా ముద్దుకొడుకు;
స్నిగ్ధతావకగళాశ్లేషణంబున కెంత
కలవరించునో కదా కన్నతల్లి;
యుష్మదాసనవీక్షణోత్సాహమున కెంత
తృష్ణఁ గాంచునో కదా దీనురాలు,

ఏగతిని నిను నెడఁ బాసి యీకుటుంబ
మకట నివసింపఁజాలు నాప్రాణనాథ!
వలదు నీ కీ నౌకాయాత్ర వల" దటంచు
వేవిధంబులఁ బ్రార్థించు విభుని నీల.

"దీనము శోకతప్తహృదధీనము నీసతిమోముఁ జూచి సంతానముఁ జూచి తత్సుఖ మెదం దలపోయుదువేని యియ్యెడన్ మానుము వార్ధియాన మభిమానముఁబూను మటంచునాథు న మ్మానిని యెంతయేని ప్రతిమాలుకొనెన్ విఫలప్రయత్నయై.

ఆలుబిడ్డల సేమమ్ము నరయువాఁడు,
తత్సుఖమ్మె తనదిగాఁగఁ దలఁచువాఁడు,
స్వార్థరహితుం, డతండు తదర్థమయిన
తన మనోనిశ్చయముఁ ద్రిప్పికొనఁ గలండె?

భార్య యగు నీల యొనరించు ప్రార్థనముల
ధీరుఁడగు సుందరుఁడు వెనదీయఁడయ్యె;
యత్నములు సేయు పురుషసింహములు త్రోసి
వైతు రవరోధములఁ దృణప్రాయములుగ.

అసల శోభ సుగారుణ్యములలోన
హాసధావళ్యంబు లావరింప;
అంధకారాంచితవ్యాపారములలోన
నభినవద్యుతిజాల మతిశయింప,
అశ్రుశీకరకల్పితాసారములలోఁ
బ్రమదాబ్ధివీచీరవము రహింప;
శ్వసనప్రతానసంచాలనంబులలోన
సుమనఆమోద మైక్యము వహింప;

అవతరించిన దపుడు పూర్వాశయందు
మండితంబగు భాస్కరమండలంబు,
ఖేదమున భార్య మివుల శోకించువేళ
మోదమున భర్త పయనమై పోవువేళ.

ఆయర్కోదయ మానెడన్ వికచనేత్రాంభోజుఁడై భక్తిధారేయుండై యొనరించె సుందరుఁడు, "తండ్రీ! నాకు నేమైననే మీ, యవ్యాజకృపాకటాక్షకలనన్ వీక్షించి రక్షింపుమా నాయాల్బిడ్డల" నంచు మానసమునన్ సర్వేశ్వరధ్యానమున్.

“నీలా! నాజలధిప్రయాణము శుభాన్వితంబు క్షేమంకరం
బై లోలత్పవనానుకూలగతిసాహాయ్యంబునన్ సాగు; ని
కేలా శంకలు? నీ వెఱుంగుటకుమున్నే వచ్చెదన్ గావునన్
బేలా, హాయిగ వేచియుండు మిచటన్ భీతిన్ విసర్జించుచున్.

“ఊయెలలోనఁ బండుకొని యూర్పులువుచ్చుచునున్న చిన్నవాఁ
డీయబలుండు ముద్దుసుతుఁ డెంతయుఁ జక్కఁదనమ్ము వాఁడు దీ
ర్ఘాయువుఁ గాంచుఁగాక పరమాత్మ ననుగ్రహదృష్టి” నంచు నీ
లాయువతీప్రియుండు పదిలమ్ముగ నుయ్యెల నూఁచెఁ బ్రేముడిన్.

అట్టు లాశాప్రయుక్తంబు లైన మధుర
భాషణంబుల నుత్సాహవంతుఁ డగుచుఁ
బలుక నేమేమొ యెదలోనఁ దలఁచుకొనుచు
వినియు వినదయ్యె నపుడు తన్వీమతల్లి.

కడకు వచియించె నీరీతిగా లతాంగి:
“నీవు ధీమంతుఁడవ, యైన నే నెఱుఁగుదు
నింత, నిశ్చయ మిది—నాథ! యింక నాకు
నీ మొగం బెన్నఁటికిని గన్పింపఁబోదు.”

“ఐన నౌఁగాని, నీల నీయాననంబు
నేను గన్గొనఁజాలెద; నేల నీకు
నిట్టి సంశయభయగతు? లింకనైనఁ
జింత మాను” మటంచు వచించె విభుఁడు.

"కడుపారఁ గన్న భాగ్యంపుసంతానంబు
నరయుచుండుము ప్రేమ మావహిలఁగ ;
ఎట్టిలోపము లేక గృహకృత్యములనెల్ల
నిర్వహింపుము నేర్పు నివ్వటిలఁగ ;
కలదానితోఁ దృప్తిఁగని జీవనం బెట్లో
సల్పుచుండుము ప్రీతి సంఘటిలఁగ ;
ననుఁగూర్చి బెంగ నీమనసునం బొందక
యూఱడిల్లుము మోదముప్పతిలఁగ ;

భారతమంతయు దేవునిపైన వదలి
యాపదుద్ధారకుండైన యతని నమ్ము ;
మతఁడె సంసారవారాశియాత్రయందు
జీవితపునౌక నడిపించు నావికుండు.

"ఒకచోఁ గల్గు మఱొక్కచోఁ గలుగఁ
డం చూహింపరా దెన్నఁడున్,
సకలాంతర్గతుఁ డాదిదేవుఁడు ;
జగజ్జాలంబు నయ్యార్తర
క్షకుఁ డీశుండె వహింప శక్తుఁడు ;
కృపైకస్వాంతుఁడై యస్మదీ
యకుటుంబంబు నజస్రమున్ మనుచు,
నీలా సందియం బేటికిన్ ?

"నీయందు నాయందు నిఖిలభూతములందు
నొక్కరీతినె వాస ముండువాఁడు;
వాలుకాణువునందు బ్రహ్మాండమునయందు
నొక్కయాకృతిఁ గొని యుండువాఁడు;
తారాంతరమునందుఁ దరణిబింబమునందు
నొక్క తేజముఁ గల్గి యుండువాఁడు;
దృశ్యవస్తువులం దదృశ్యశూన్యమునందు
నొక్కభావంబున నుండువాఁడు,

నయనమున జార్చు నొకవీక్షణమ్ము వలన
లీల లోకమ్ములెల్లఁ బాలించువాఁడు;
ఆపరాత్పరుఁ డీశ్వరుఁ డనవరతము
వందనీయుఁడు, నమ్ము మవ్వాని నీల!

"ఆతని సృష్టిలోనివనుమా భువనావళు, లీవిశాలధా
త్రీతల, మీపయోధి; నెలఁదీ! దవుదవ్వులఁ బ్రాగ్గిగంతరో
ద్భూతపరస్థలంబులకుఁ బోయినమాత్రన వానిఁ బాయఁగా
నాతరమా? భయంబుడిగి నవ్వొవహింపుము మోవిని త్తఱిన్."

నిలువని శోకభారమున నిర్గతబాష్పములన్ గళ స్తనో
బలమున నేలపై కపుడు వ్రాలు లతాంగికి నైజబాహుశా
ఖల నవలంబనం బొసఁగి గాటపుఁగౌఁగిటఁ జేర్చినాఁడు క
న్గొలుకుల నొండురెండుచినుకుల్ దిగజాఱఁగ సుందరుం డటన్.

అప్పుడు వగ్గి కౌంగిఁ దన యంసమునందు గళమ్ము వాంచి దుఃఖమ్మున నేడ్వఁగాఁ గనులఁ గాఱఁ దొడంగిన యుష్ణబాష్పపూరమ్ములు నెమ్మొగమ్మునకుఁ బ్రాఫు నొసంగిన ప్రాణనాథు వక్షమ్ముపయిన్ ప్రవాహములుగాఁ బ్రవహించిన నాక్షణమ్మునన్.

ఒక్కొకొకటిగ వచ్చు నిట్టూర్పుల రొద,
నడికి యుప్పొంగునట్టి శోకోర్మివితతిఁ,
కనులఁ బొడమిన బాష్పముక్తాఫలాళి,
నెఱులో దాఁచుకొన్నది నీల హృదయవార్ధి.

అర్థ మెఱుఁగక నయనమ్ము లల్ల పిచ్చ
యబ్బురమ్మున నాఁటిదృశ్యమ్ముఁ గాంచు
బాలికాబాలకులఁ బ్రేమలీలఁ గేలఁ
దీసికొనుచు ముద్దాడె నాధీరుఁ డపుడు.

గతరాత్రిని గడుఁదీవ్రమౌ జ్వరమునను గన్నోడుపే లేక పీడితుఁడై వేఁగిన ముద్దుపట్టి యిపు డుండెన్ గాఢనిద్రాసమన్వితుఁడై చేలపుటుయ్యెలన్; నెలఁత వానిన్ లేపి తేఁబోవు చో నతఁ డాత్రంబున నేగ నయ్యెడకు వద్దంచున్ నివారించుచున్.

నిదురవోవు కొమరునిం గాంచి ముద్దాడి
యతఁడు కట్టకడకు సతికి నౌక
యేగనున్న దినము నెఱిఁగించి నౌకాశ్ర
యాభిముఖుఁడుగాఁగ నరిగె వేగ.

చీరచెఱంగుఁ బట్టుకొని చిన్నికుమారియు నందనుండు వి
ప్ఫారిత నేత్రయుగ్మములు నబ్బురపాటున నట్టె చూడఁగా
ద్వారమునొద్ద నిల్చి వనితామణి బాష్పముగ్రమనాక్షులన్
గోరికఁ జూపుమేరవఱకున్ గని నాథుఁడు వీడిపోవుచోన్.

తరుణీహృదంతరోత్పన్నశోకము భంగిఁ
దుంగభంగంబు లుప్పొంగి పొరల,
యువతీనవీనవియోగగీతము రీతి
గంభీరఘోషసంరంభ మొదవ,
వనితావిముక్తనిశ్వాసోత్కరము మాడ్కి
ననిలసంకులసంచలనము పొడమ,
అబలానయననిర్గతాస్రపూరముపోల్కి
నంబుశీకరసంచయంబు లురల,

సాగరంబున, దూరదేశప్రయాణ
మొనరఁజేయఁగ బయలుదేఱినది నౌక;
నాఁడు సుందరుఁ డందుఁ గలాఁడటంచుఁ
దనివితీఱక చూడసాగినది నీల.

అంతకంతకు దవ్వుగా నరుగు నోడ
క్రమముగా ఘోరవారాశిగర్భమందు
మునిఁగిపోయినరీతిగాఁ గనఁబడినది
నీలహృదయంబు శోకవార్ధి మునుంగ.

*

# నౌకాభంగము: 3

ఊ ఉ డిం పు

శాంతము వార్ధివేల్లితవిశాలధరావలయోర్ధ్వవర్ధిత
ధ్వాంతము జారచోరజనతాసముపాత్తగహోవిహారసం
క్రాంతము జీవకోటిగతగాఢసుషుప్తివినిశ్చలీకృత
స్వాంతము దోఁచె నంతట విభావరి శబ్దసముద్భవాంతమై.

మేలిమిచంద్రకాంతముల మేడపయిన్ విరిపాన్పునందు మై
వాలుపుఁ జెందినట్టి మహిపాలకుఁడున్ గఱుకుందనంపు టా
నేలనె కన్ను మోడ్పుఁగను నిర్ధనుఁడున్ సమపక్షపాతని
ద్రాలలనానుషంగపరతన్ సుఖమొందిరి యొక్కరీతిగన్.

కేవలతామసీపటలకీలితమా నడిరేయిపాన్పునన్
స్థావరజంగమాత్మకము సర్వము విశ్వ మభంగగాఢని
ద్రావివశత్వమందినకతమ్మునఁ గన్గొనఁజాల దింతయున్
జీవితఖేదమోదములఁ జీఁకటివెల్గులఁ గల్గు భేదమున్.

సకలాంతర్గతలోకపాలకమనస్సంకల్పమాత్రైకసృ
ష్టికళాభాసురచాతురీప్రకటనశ్రీరమ్యముల్ తారకా
నికరంబుల్ నిజతేజమేకసరణిన్ దీపింపఁజేసెన్ దరి
ద్రకుటీరంబుల రాజరాజవిలసత్ప్రాసాదరాజంబులన్.

అంభోరాశివిజృంభణాభిరతవీచ్యభ్యంతరావిర్భవ
ద్గంభీరస్వర మావినిశ్చలనిశాగర్భంబునన్ భూరిసం
రంభప్రస్ఫుటమై తగెన్ బ్రకృతిలీలాశాశ్వతత్వంబు ప్రా
రంభాంతంబులు గానరాని దని యాలాపించుచందంబునన్.

చుక్కల్ చెక్కిన నీలియంబరపు
    టంచుల్ నేల వ్రేలాడఁగా
దిక్కూలైకపదప్రవర్తన
    మహోద్వేగోర్మికాఘోషముల్
పెక్కుల్ నెక్కొనఁగా నిరుల్ కురులుగా
    విప్పారఁగా, మృత్యువున్
న్యక్కారం బొనరించు రేవెలఁది
    కన్పట్టెన్ భయంకృద్గతిన్.

నీరావమ్ము వినిశ్చలమ్ము జనతానిద్రాభరోన్మత్తసం
చారమ్మా రజనీప్రపంచమిది నాసామ్రాజ్య మన్నట్లు గం
భీరస్వాన ములూకరాజు సలిపెన్ వృద్ధావనీజంబుపైఁ
దారాకాంతలవమ్ము లేని గుబురుందట్టంపుఁ బెంజీఁకటిన్.

పున్నెముఁ జేసికొన్న శుభమూర్తులు మేనులువాసి యమ్మహో
భ్యున్నతనాకలోకమున నుజ్జ్వలకాంతులఁ దారకమ్ములై
యెన్నియుగాలనుండిగ నొకేగతి భాసిలువారొ సౌఖ్యసం
పన్నతలేని మానవుల వర్తనముల్ తిలకించి నవ్వుచున్!

ఆరాత్రిన వెసఁజెంది దుర్భరవిషాదాక్రాంతచిత్తంబునన్
బూరింటన్ గదిలోననొక్క యెడఁదల్పుల్ మూసి కూర్చుండెఁగాం
తారత్నంబగు దీనురాలొకతె నిద్రాలేశమే లేక చ
క్షురారూఢమ్ములు బాష్పపూరములు చెక్కుల్ నిండిజాల్వారఁగన్.

బాలయు బాలకుండు నొకవంకను వేసినయట్టి స్వల్పపు
నేలనె హాయిమీఱ శయనింపఁగ నొక్కెడ మంచమందు బా
ధాలసుఁడై జ్వరార్తిఁ గొను నర్భకు నొద్ద నితాంతఖిన్నయై
నీల వసించి యేడ్చినది నిద్ర యెఱుంగని లోచనంబులన్.

క్రమపరిహీణతైలపరికల్పితదీప మొకండు మిణ్కుమి
ణ్కుమనుచు సన్నగిల్లువెలుఁగుల్ గలిగించిన దాగృహాంతరా
ళమున, శరీరసౌష్ఠవబలమ్ములు క్షీణతనొందఁగాఁ గృశ
త్వము వహియించి ప్రాణములు వాయఁగనుండిన యువ్విక్ తనడిన్.

"ఉడుకుచునున్న దిప్పుడు మహోష్ణగతిన్ భరియింపలేని నీ
యొడ ; లొకతప్పుపాటయిన నొందనికన్నులు జీవతేజమే
యుడఁగఁగఁ దెల్పుదేఱినవి యక్కట పుట్టినదాదిగాఁగ ని
న్నీడువని రోగబాధలకు నీవు కుమార, యెటుల్ సహింతువో.

"లోకము గాఢపుణ్ణిదురలోన మునింగి సుఖించుచున్న యీ
చీఁకటిరేయి మోడ్పయినఁ జెందనికన్నులఁ దీవ్రవేదనన్
జేకొను నిన్ను నన్నుఁ గని చెమ్మగిలన్ నయనమ్ము లేదు స్నే
హైకత నూఱడింపు పలుకాడఁగఁ గంఠము లేదు నంగనా!

"జలనిధిపిచికానిచయసంభవ ఘోషము, రాలు నెండుటా
కులు పలవించు మర్మరపు ఘోషము, గింగురుమంచుఁ గీఁచురాల్
సలిపెడి ఘోషమున్, విటపిశాఖల భీకరఘూక ఘోషముఁ,
జెలిమినుడుల్ గదా మనకుఁ జీఁకటిరాసులు నిండు నిసిశన్.

"నేఁడేవచ్చునొ ఱేపెవచ్చునొకదా నీతండ్రి యంచున్ సదా
యోడల్ వచ్చినవెల్లఁ గన్గొనుచు నెంతోయాశతో నుండ నే
జాడల్ నేఁటికి లేకపోయినవి వత్సా! యింక నేరీతి నీ
తోడన్ గాలముపుత్తు నీరవముగా దుఃఖించుచున్ నామదిన్?

"తనయా! మామకపూర్వపుణ్యమున నొందంజాలితిన్ నిన్; భవ
జ్జనకాశీర్వచనప్రభావమున నీశప్రేమపీయూసుధా
ఘనదివ్యౌషధసాధనంబున సమగ్రంబైన యారోగ్యముం
గని వర్ధిల్లుము తల్లిదండ్రులు తమిన్ గాంచం జిరంజీవివై."

నీలామాతృమతల్లి నేలపయి శ్రోణిన్ నిల్పి మంచమ్ముపైఁ
గేలుందోయి నొకింతయాని శిరమున్ గీలించి బాష్పావళుల్
రాలంగా విలపించె రేవలె నిరుల్ వ్యాపించు డెందంబునన్
బాలున్ ద్రావని చిన్నిపట్టి విషమావస్థన్ విలోకించుచున్.

అమ్మఱునాఁడు నీల హృదయమ్మునయందు నకారణమ్ముగాఁ
గ్రమ్మెను భావమొండు నిదురంగనిపించిన స్వప్నమట్లు; దూ
రమ్మునఁ జిన్నినందనుని రమ్మని యెవ్వరొ పిల్చినట్లు, నే
త్రమ్ముల యంచలమ్ములు గదల్చుచు సైగలుసేసినట్లుగా.

ఎఱుఁగదు నీల భావిగతి యింతయు; నశ్వరదేహపంజరాం
తరమునుండి యేసుఖదనందనవీధులలోనొ స్వేచ్ఛగాఁ
దిరుగఁగ, దుర్లభంబులగు దివ్యసుఖంబుల నందఁగా, నన
శ్వరము సుతాత్మకీర మిహబంధమువో నెగిరెన్ క్షణంబునన్.

కడుపునం గాంచి యుపచారకలనఁ బెంచు
మాతప్రేమంబుఁ బోలు ప్రేమంబు గలదె?
క్ష్మాతలంబున గర్భశోకంబుకంటె
గాఢతరమగునట్టి శోకంబు గలదె?

అంబుధియాత్ర సేయఁ జనినట్టి మనోవిభు విప్రయోగ మం
తంబగుఁ గొన్నినాళ్లకుఁగదా యని యాశ వహించియున్న నీ
లాంబిక శాశ్వతంబయినయట్టి తనూజవియోగజాతదుః
ఖంబు నెదన్ గదించుకొని కాలము నేగతి నింకఁ బుచ్చునో.

ఆనీలాంజననీమతల్లి శ్వసనవ్యాపారశూన్యంబు ని
ష్ప్రాణంబున్ జడమున్ నిరుద్ధహృదయస్పందంబు నౌ వానిమే
నానున్ వక్షమునందుఁ, గౌఁగిలిడు నత్యాసక్తి, భూతాళి కా
హా నిర్జీవకళేబరంబుపయి మోహభ్రాంతి యెంతో కదా!

ఏడిచియేడ్చి తుట్టతుద కేగి శ్మశానమునన్ మృతార్భకున్
బూడిచి వచ్చి యింటనొకమూలను మర్త్యులయాననంబులన్
జూడఁగలేక గోడదెసఁ జూడ్కులు నిల్పఁగఁ బుత్రశోకమే
చేడియగా నెసంగఁగ వసించె వియోగిని నీల యక్కటా!

చిన్నతనంబునందుఁ దనచెల్లి యొనర్చిన బాల నీల యా
పన్నత ఖిన్నతన్ మిగుల వందురుచున్న దటం చెఱింగి సం
పన్నుఁడు సజ్జనుండగు కుమారుఁడు జాలివహించి యత్తఱిన్
దిన్నగ వచ్చె నప్పురమదీనమతిన్ గని యూఱడింపఁగాన్.

తరణియానం బొనర్చు సుందరుఁడు వోయి
నది మొకలుగాఁగ నీలయాస్యంబుఁ గనని
యాకుమారుని నాతని యంతరాత్మ
శూలఘాతమ్మె వేధించెఁ జాలగతుల.

పసితనంబున నాటలఁ బాటలందుఁ
జెలిమిమాటలఁ దన్పిన చెలియ నీల ;
యామె క్షేమమ్ముకొఱకు సౌఖ్యమ్ముకొఱకు
నాఁకలిం గొన్న యతని హృదంతరంబు.

అతఁడు చల్లనిమాటల నామెదుఃఖ
ముపశమింపఁగఁ గొంతసే పూఱడించి
"యొక్క యుపకృతి నీకడ నొందఁగోరి
యరుగుదెంచితి నీలా" యటంచుఁ బలికె.

అక్కాంతామణి స్తంభితాశ్రుకలుషంబౌ గొంతునం బల్కె నీ
చక్కన్: "నీవుపకారకాంక్షఁగొని యాశల్ భంగముం బొందఁగా
నిక్కట్లంబడుచున్ నిరంతరము నెంతేదుఃఖముం జెందు నీ
దిక్కుంగానని దీనురాలికడ కర్థిత్వంబునన్ వత్తువా ?"

అతివ యుడిన మనోవేదనాంకితముగు
నుత్తరమునకుఁ జిత్తంబు తత్తఱింప
వెనుకకున్ సిగ్గు, జాలి ముందునకు లాగ
నతఁడు కడ కామెదరిఁ జేరి యనియె నిట్లు.

" చిన్నతనముననుండి నీచెలిమి సేసి
పరిణయం బాడినాఁడు సుందరుఁడు నిన్న ;
అతఁడు నీప్రాణనాయకుం డతని హృదయ
వాంఛ నీ కెఱిఁగింపఁగా వచ్చినాఁడ.

" ప్రారంభించిన కార్యమున్ సఫలమౌ నందాఁక సాగించువాఁ
డేరీతిన్ దలపోసినన్ ఘనుఁడు సాధ్వీ, మిన్న నాకన్న నౌ
ధీరున్ సుందరు నెన్నుకొంటివి మనోధీశుండుగా నీకు ; వే
మాఱుల్ మున్నదిమేలుమేలనుచు సంభాషించియుంటిన్‌గదా !

" ఆలుంబిడ్డలవీడి కష్టపడి వార్యానంబుఁ గావింపఁగా
నేలా యేగినవాఁడు నీదుహృదయాధీశుండు చిత్తంబునం
దాలోచింపుము ; లోకమందుఁగల దేశానీకముల్ ప్రీతిమై
నాలోకించిప్రమోదమొందుటకుఁ గాదంచున్ విచారింపుమా.

" అతఁడు తనకంటె నీకంటె నన్నిగతులఁ
గన్నబిడ్డలు మిన్నలై క్రాలవలయు
నన్నకోరిక గాటమై యాత్మ నొదవఁ
జనినవాఁడు ధనార్జనాసక్తుఁడగుచు.

" విద్యఁ బడయఁజాలక వీథివీథులందుఁ
గన్నబిడ్డలు పశువులకరణిఁ దిరుగఁ
గాంచి మనమున నెంత చింతించునొక్కొ
మఱలి యే తెంచునపుడు సుందరుఁడు నీల !

" కావునఁ బ్రార్థన మొక్కటి
కావించెద దానిఁ దీర్పఁగాఁదగు ; మనయీ
జీవితములందు నెల్లన్
నీ వెఱుఁగవా నన్ను, నేను నిన్ను నెఱుఁగనో ?

" ప్రాణకాంతునియందు సంతానమందు
నీకుఁగల ప్రేమఁ దలఁచి, నీలాకుమారి !
నాపయి భవత్కృప యొకింతచూపి, యింక
మాఱు వలుకక నాకోర్కె దీరనిమ్ము.

" బాలికన్ బాలకునిఁ బాఠశాల కంపి
విద్య చెప్పింపనిమ్ము తన్వీమతల్లి,
యేను ధనశాలిఁ గాన ; నీయిచ్చ యేని
తిరిగివచ్చి నీపతి బదుల్ తీర్పఁగలఁడు. "

మూలకుఁ ద్రిప్పుకొన్న కనుబొమ్మల శోకము తాండవింపఁగా
నేలకు సూటిగా నిజకనీనిక లల్లనఁ జూపు లానఁగా
నీల కుమారుఁ డాడిన వినిర్మలనవ్యసుధాసమాన వా
క్యాలకు నుత్తరంబిడియె నప్పుడు రుద్ధగళస్వరంబునన్.

“హృదయము వ్రయ్యలై పగులనేడ్చిన యీమె దరిద్రపీడ నీ
సదమలమౌ ముఖంబుఁ గనఁజాలదు ; నీ వరుదెంచినప్పుడే
తుదిగనరాని నాయధికదుఃఖము వ్రయ్యలొనర్చె గుండె ; నీ
మృదుకరుణారసంబు మఱియిప్పుడు వ్రయ్యలొనర్చు నక్కటా!

“బ్రతికియే యున్నవాఁడు నాపతి ; యతండు
తిరిగివచ్చి నీదుఋణంబుఁ దీర్పఁగలఁడు ,
ధనమునకు మాఱు ధన మీయఁదగును గాని
దయకుఁ బ్రతిదయఁ జూపఁగాఁ దరముకాదు.”

“ఐనన్ నాకు ననుజ్ఞయిచ్చితివె
నీలా!” యంచు నాతండు బ్ర
హ్మానందంబు వహింప, లేచి
భ్రమమాణాలోకజాలంబులన్
వానిం గాంచిన దామె యొక్కక్షణ ;
మాపై నాతఁడుం బోవఁగా
నానీలాసతి వెంట నేగినది
గేహద్వారపర్యంతమున్.

*

# నౌకాభంగము : ౪

వలపు వంట.

ఆసాయాహ్నమునన్ సఖుండు సఖి
యన్యోన్యానురక్తిన్ మహో
ల్లాసం బందిన దాదిగాఁగ
వెలుఁగుల్ నష్టింపఁగా దామసీ
రాసుల్ నిండిన జీవితైకనిశకుఁ
బ్రాప్తించె నీనాఁడు గా
దే సూర్యోదయ మంచుఁ గాంచె
ముద మెంతేనిన్ గుమారుం డెదన్.

ఏకాంతంబునఁ దోడునీడయనుమాటేలేక చీఁకట్లలో
శోకం బొందిన వానిజీవితము తేజోవంతమై సమ్మద
శ్రీకల్యాణమనోహరంబయి తనర్చెన్ నేఁటికిన్గాదె నీ
లాకాంతామణి బాలబాలికల యుల్లాసైకహాసద్యుతిన్.

చలువఁదనంపు వెన్నెలల చక్కిలిగింతల నవ్వులీను చెం
గలువ సుమమ్మువోలెఁ, జలికాలపు మ్రోడుఁదనమ్ము వోవఁగా
వలరుఁజివుళ్లసంపదల నందిన సాలమువోలె, భానుదీ
ప్తులఁ దెలివొందుతమ్మివలెఁబొల్చెఁగుమారునెడంద యత్తఱిన్.

పాఠశాలకుఁ జని విద్యఁ బడయునట్టి
బాలికాబాలకులఁ బ్రేమలీలఁ గనుచు
వారి యిష్టంబు లరయుచు స్వాంతమందుఁ
దనివిఁ గనెఁ గుమారుఁడు కన్నతండ్రివోలె.

శ్రేయోదాయకుఁడౌ కుమారుని ఘనశ్రీభోగసర్వస్వ మా
త్మీయంబైనయటుల్ కరంబు ననురక్తిన్ బాలికాబాలు రి
చ్ఛాయుక్తిన్ విహరించుచుందు రెపుడున్ స్వాతంత్ర్యభావంబునన్
హాయిం జెందుచుఁ దన్మనోహరనిశాంతారామభాగంబులన్.

అన్ని విధములఁ దమసౌఖ్య మరసి తమ్ము
నెట్టి లోపంబు రాకుండ నెపుడు మనుచు
నల కుమారునిఁ దండ్రిగాఁ దలఁచి యెల్ల
పిలుతు రాబాలబాలికల్ ప్రేమ వాడమ.

దూరమున వీధికొననుండి తోఁచునట్టి
యాలయద్వారముం గాంచినంతఁ బరుగు
పరుగునన్ బోవుదురు బాలబాలికలు కు
మారజనకుని మధురచుంబనముకొఱకు.

ముద్దుమాటల వారు దెల్పుకొనునట్టి
చిన్ని జగడాలరీతులు, చిన్నతనపు
టాటపాటల ముచ్చట లాలకించు
విసువుఁ గానని యాతని వీనుదోయి.

వేడుక యుద్భవింప నొకవేళఁ గుమారునిఁ బట్టి లాగి వ్రే
లాడుచునుండు, నొక్కసమయంబునఁ బైఁబడి వానితోడ నా
టాడుచునుండు, నొక్కతఱి నాతనియంకమునన్ వసించి మా
టాడుచునుండు, నిష్టమెటు లాత్మకు నట్టులు బాలబాలికల్.

తన్నె జనకునిగా నాత్మఁ దలఁచునట్టి
బాలికాబాలకులకు సర్వమ్ముఁ దాన
యగుచు నాత్మసర్వస్వ మాయత్తపఱచె
వారలకు స్నేహశీలి కుమారుఁ డపుడు.

కలఁగిన నిద్రలోనఁ బొడఁగాంచిన స్వప్నమువోలెఁ జీఁకటుల్
వెలుఁగులు నావరించు తొలివేఁకువ దవ్వుల నెందుఁబోవునో
తెలియఁగరాక యస్ఫుటగతిన్ జను నాకృతివోలె మెల్లనన్
దొలఁగుచుఁ దండ్రిసుందరుఁడు దోఁచెఁ దదీయహృదంతరంబులన్.

మఱపుఁదెరచాటునందు సుందరుఁడు మఱుఁగు
పడియె దినములు వడివడిఁ గడచిపోవ ;
బదులుగాఁ గుమారుఁడు నేఁడు వారిహృదయ
పదములందు నివాస మేర్పఱచుకొనియె.

ఆటపాటలఁ జిఱుతప్రాయంబునందు
హార్ద మొనఁగూర్చినట్టి స్నేహావతి నీల ;
ఆమెకొఱకైన శాశ్వతప్రేమమునకు
వాస మేర్పడియెఁ గుమారు స్వాంతమందు.

ఆచెలియ మోముఁ గను కోర్కె యతని మాన
సమ్మునకుఁ గలుగని యొకక్షణము లేదు ;
లోకనిందకు వెఱచిన యాకుమారుఁ
డకట తీర్పంగలేఁడయ్యె నాత్మవాంఛ.

ఎన్నఁడోకాని యేగనేయేగఁ డకట
నీలయింటికిఁ ; గాని యాబాలబాలి
కలవలన నాత్మతృప్తికిఁ గాన్క లంపు
నేదియో నెపమున నాతఁ డెల్లయపుడు.

నీల యేకాంతవాసము, బాలబాలి
కామనోహరోల్లాసము, ప్రేమతృప్తిఁ
బడయని కుమారు దీర్ఘనిశ్శ్వాసము, దగ
నరిగెఁ గొన్నివర్షములు సుందరుఁడువోయి.

అంత నొకనాఁటి రుచిరసాయంతనమున
నీలతోఁ గూడి బాలయు బాలకుండు
నరుగఁదలఁచిరి యుత్సాహ మతిశయింప
గ్రామసామీప్యభాసురారామమునకు.

ఆకుమారునిఁగూడ వనాంతరమ్ముఁ
జూడఁ దమతోడ రమ్మని వేడుకొనిన
బిడ్డలకు, నీలపయిఁగల ప్రేమవలన
నతఁడు మాటాడకుండ సమ్మతిని దెలిపె.

ఎలదీవకన్నె మిన్నలఁ గౌఁగిలించి గం
ధవహుండు ప్రేమమంత్రములు నుడువ,
పూవుటింతుల తీయమోవి తేనియ లాని
యళికుమారుఁడు గీత మాలపింప,
క్రొమ్మోవిచివురుటాకులు మెక్కి కలకంఠ
బాలుండు మధురనిస్స్వన మొనర్ప,
ఱాలసందులనుండి ప్రవహించు సెలయేటి
యూట చల్లఁదనంపుఁబాట పాడ,

శ్రీవసంతనితాంతశోభావిభాస
మానమై రెండుకొండలమధ్యమందు
నలరు నక్కోన నాఁటిసాయంతనాన
వారలకుఁ గానఁబడెఁ జూపుమేరలోన.

ఆకుంబచ్చని పట్టుపుట్టము కరంబందంబుఁ గల్పింపఁగా
నైకంబుల్ రుచిరప్రవాళచయరమ్యంబుల్ సువర్ణప్రభా
సాకల్యప్రచురంబులై యలరు భూషల్ సొంపునింపన్ వన
శ్రీకాంతామణి మాధవుంగనివహించెన్నూతనామోదమున్.

ఆ రమణీయశోభ గల యామనివేళల శీతవాతవి
స్తారహతిన్ మనోహరతఁ దప్పిన మ్రోడులుసైతమున్ శుభా
కారతఁ బల్లవించెఁ, జిరకాలము వాంఛితసుందరీతిర
స్కారమునన్ వ్యథించు నెద కాంక్షలుదీరఁ దలిర్చుకైవడిన్.

చిరకాలమ్ము మనమ్మునం దనితరజ్ఞేయమ్ముగా డాఁగి వి
స్ఫురణంబంది బహిర్గమించు పరువంపుం బ్రేమవోలెన్ వనాం
తరమందున్ వలపుల్ సెలంగినవి తద్వ్యాసంతమందానిలో
త్కరసంస్పర్శనఫుల్లకుట్మలదళాంతర్బంధముక్తంబులై.

కొమ్మ సుమనోంతరమున డాఁకొనిన వలపు
లపహరించి తేనెలు గ్రోలు నళికుమారుఁ
గాంచి పూర్వానుభవముఁ దలంచి వేద
నామతిఁ దొలంగె భృంగసుందరుఁ డొకండు.

నివురుంబొంది యడంగు పూర్వవిరహాగ్నిజ్వాలికామాలికల్
రవులన్ గ్రమ్మిన శోకధూమములలీలన్ గ్రొత్తలై మొల్చు ప
ల్లవసందోహము లెత్తఁబారునెడఁ దత్ప్రాంతంబులన్ జంచరీ
కవితానంబులు సంచరించినవి స్నిగ్ధంబౌ వసంతంబునన్.

నడకబడలిక నడుగులు తడఁబడంగ
నిడుదయూర్పులు వెడలఁగఁ బడఁతి నీల
యొక్కఱాతిన్నెమీఁదఁ గూర్చుండె నంత
నామెపార్శ్వంబునఁ గుమారుఁ డధివసింప.

శ్రాంతింబొందినచోట నుస్సురని నిశ్శ్వాసంబులం బుచ్చుచున్
గాంతారత్నము నీల యయ్యెడ శిలాంకంబందుఁ గూర్చుండి వి
శ్రాంతింబొందఁగ బాలబాలికలు స్వేచ్ఛాలీలఁ బర్వెత్తుచున్
గాంతారామమునం జరించిరి ముదాక్రాంతాంతరంగంబులన్.

తీవల లాగి హస్తములఁద్రెంచుచుఁ గొమ్మలవంచి త్రుంచుచున్
బూవులఁగోయుచున్ జివురుమొగ్గలఁ దీయుచు విస్ఫురస్మనో
భావముతోడ బాలికయు బాలుఁడు బాల్యవినోదఖేలనా
రావములం బొనర్పఁ బ్రతిరావము గల్గె వనాంతరంబునన్.

కడచిపోయిన జీవితగాథలెవియొ
జ్ఞప్తిపథమునఁ గన్నులఁ గట్టినట్లు
గోచరింపఁగఁ దనప్రక్కఁ గూరుచున్న
తరుణి యున్కిఁ గుమారుండు మఱచినాఁడు.

ఈవనమందె పూర్వ మొకదృశ్యము తీవ్రశరంబుకైవడిన్
బూవుటెడంద నాటుకొనిపోవఁగ నేనిమిసంబునందు న
చ్చో వసియింపనోడి వెనుఁజూడ్కులఁ దాఁ దిమిరాలలోనికిన్
బోవఁగడంగె నానిమిసమున్ దలపోసెఁ గుమారు డత్తఱిన్.

అంతర్లోచనగోచరంబులగు నూహోర్ధ్వంబులం బోవువాఁ
డంతన్ వీక్షణముల్ మఱల్చుకొని బాహ్యజ్ఞానముంబొంది యా
చెంతన్ నీల వసింపఁగాంచి వచియించెన్: "బాలికాబాలకుల్
సంతోషంబునఁ జేయు ఖేలనగతుల్ కన్గొంటివే దవ్వులన్?

"అలసితివో మఱేమొ హృదయంబునయందుఁదలంచుకొందువో
పలుకవు నీల! మున్నెపుడొ వార్నిధిఁ గ్రుంకిననౌకకై యిటుల్
తొలఁగనియాశ వెట్టుకొని దుఃఖమునన్ మరణించి కన్నబి
డ్డల నొనరింతువే కటకటా తలిదండ్రులులేనివారిఁగాన్ ?"

ఆకరణిన్ సఖుండు పలుకాడఁగ నీల వచించె నీగతిన్:
“నాకగుఱించి నే మనమునన్ దలపోయుటలేదు ; వారియా
కేకల నాలకించి పరికింపఁగ నక్కట తోడులేని యే
కాకిని నైనటుల్ మదికిఁ గారణమేమియొకాని తోఁచెడిన్.”

అపు డోకించుక డగ్గఱి యనియె నతఁడు:
“నీల ! కలదొండు నామనోనిలయమందు ;
ఎంతకాలంబునుండియో యెఱుఁగఁ గాని
యెన్నఁడో బయల్వడునంచు నే నెఱుఁగుదు.

“నిన్నఁ బలువత్సరములకు మున్న విడిచి
వెడలియుండుటయేడ ? జీవించియుండు
టేడ ? యతఁడు వచ్చునటంచు హృదయమందు
నాశనొందుట నట్టిమౌఢ్యమ్ము గాదె ?

“అన్యసాహాయ్య మవసరమైన నీవు
పేదవై దురదృష్టజీవితము నెటులో
కడపుచుండుటఁ గనులారఁ గాంచి యకట
యేవిధంబున నోర్చు నాయెడఁద నీల !

“ఇచ్చమెయి నీకు సాహాయ్య మే నొనర్పఁ
జాల నొకచందమునఁగాని నీల ! నిశిత
మతులు సతులంట!—యపుడె నామనసుఁ దెలిసి
తేమొ!—నాభార్య వీవౌట, యిదియ కోర్కె.

"తండ్రి నయ్యోద నీదుసంతానమునకు
వారు ప్రేమించెదరు తండ్రివలెనె నన్ను
నని తలంచెద; నాబిడ్డలట్ల వారి
నేను బ్రేమింపఁగలవాఁడ నిశ్చయముగ.

"కావున నీవు నాకు వడిగాఁ బ్రియ నయ్యోద వేని వేదనా
భావమలీమసమ్ములగు పాడుదినమ్ములు నిర్గమింపఁగా
దేవుఁడు జీవరాసులకు దివ్యకృపన్ దయసేయు సౌఖ్యముల్
జీవితమందుఁ బొందుదము చింతలుదక్కిన మానసంబులన్.

"ధనము గలవాఁడ బంధుమిత్రములు వేఱ
లేరు నీవును మఱియు నీవారుఁ గాక;
భారి మేదియు మామకస్వాంతమునకు
యుష్మదీయంబుగాక వేఱొండు లేదు.

"ఇందనుక జీవితంబులయందు నెల్ల
నొకరినొకర మెఱుంగుదుముకద మనము;
మఱియు నీ వెఱుంగకమున్న మనసు నొసఁగి
నిన్నుఁ బ్రేమించియుంటిఁ దన్వీమతల్లి!"

అతనివాక్యంబు లాలించి యపుడు నీల
లలితనవనీతకోమలోక్తుల వచించె:
"ఆపదలనుండి నన్నుఁ గాపాడఁదలఁచి
దేవుఁ డంపిన దివ్యమూర్తివి కుమార!

"అందులకు నీశ్వరుండు నిన్ననవరతముఁ
బ్రోచి యిడుఁగాక నీశీలమునకు ఫలము
గాఁగ హతభాగ్యనైన నాకంటె భవ్య
తరము సుఖవత్తరంబు సద్భాగ్య మెదియొ."

అనిన విని వెండియుం బల్కె నతఁడు, "నీల!
యెన్నఁడో చిన్నతనమున హృదయమెల్ల
నీ కిడిన దీనుఁడు దరిద్రుఁ డీకుమారుఁ
డాస విడలేఁడు ప్రేమభిక్షార్థి యగుచు.

"ఇంతకాలమ్ము తుదిలేని తృష్ణ నోర్చు
కొనిన నన్నుఁ బ్రోవుము నీల!" యని వచించు
నతనిదీనవాక్యములు లతాంగియెడఁద
నంకితములుగ మఱల నిట్లనియె నామె.

"ఓయిసఖా! యొకింతతడ వోర్వుము; సుందరుఁ డేగుదెంచునే
మో, యతఁ డింకరాఁ; డయిన నోర్చుకొనందగు నొక్కవత్సరం,
బాయవధిన్ మదీయహృదయంబను మానముఁ బాయు, నోకుమా
రా, యొకవత్సరంబనిన నంతగ దీర్ఘముగాదు గావునన్."

నావిని దైన్య మొల్కువచనంబులఁ బల్కెఁ గుమారుఁ డీగతిన్:
"బావనతన్ వహించిన భవన్మధురప్రణయైకభిక్షుకై
జీవితమెల్ల నోర్చుకొని చేతులుసాఁచిన దీనుఁడన్ గదా,
యోవనితా! యొకింతతడ వోర్పువహించుచు వేచియుండనే?"

అనిపలుక నీల "కాదు మున్నాడినట్టి
మాటకున్ బద్ధురాలఁ గుమార , యదియు
వత్సరములో ఫలించు ; నావలెనె నీవు
నోర్చుకొనవే ? " యనఁగ నతఁ డూఱడిల్లె.

ఆగతి సంభాషించిన
యాగళములు రెండు మాటలాడక యొకటన్
మూఁగతనమ్ము వహించుచు
నాఁగినయవి దినమురీతి నాసమయమునన్.

క్రుంకె నినుండు పశ్చిమపుఁగొండల కావల, సాంధ్యరక్తి న
ల్వంకలయందుఁ గ్రమ్ముకొనివచ్చు తమమ్మున నంతరింపఁగా,
నింకిట నిల్వరా దనుచు నెంచి కుమారుఁడు పిల్చెఁ గేళికా
సంకలితాత్మతన్ బరవశత్వముఁ గాంచిన బిడ్డలన్ వడిన్.

బాలికాబాలకులతోడ నీలతోడ
నరిగినాఁడు తదీయగేహమ్ము వఱకు
నాకుమారుఁడు క్రొంగ్రొత్తలైన వేవొ
భావములు మానసంబున నావరింప.

ఆసమయంబునం దనియె నాతఁడు : "నీవు మనోబలస్థితిం
బాసిన వేళ నే నెవియొ మాటలు పల్కినవాఁడఁ గాన నా
దోసము నియ్యెడన్ గరుణతోడ క్షమింపుము ; నీకు బద్ధుఁ డీ
దాసుఁడె, నీవుమాత్రము స్వతంత్రవు నిచ్చలు మానినీమణీ ! "

అని కుమారుండు వచియింప నాలకించి,
కన్నుఁగవనుండి యశ్రువుల్ గాఱ నేడ్చి
జాలి తోల్కాడఁ బల్కె నీలాలతాంగి,
"యెన్నఁటికి బద్ధురాలనే యే" నటంచు.

తా నెఱుంగక పూర్వమే తన్నతండు
వలచినాఁడంట యని నీల తలఁచుచుండ
నంతలో వేగ వత్సరం బరిగె నపుడు
మాట చెల్లింపు మనుచుఁ గుమారుఁ డడిగె.

నమ్మరాని వేవియొ కారణములు సెప్పి
పడఁతి మఱికొన్ని మాసముల్ గడుపుఁగొనియె ;
"అటులై నీ యిచ్చవచ్చినయంత కాల
మీవు గైకొను" మని వచియించె నతఁడు.

అంత నొక్క నిశాసమయమున నీల
డెందము కలంత నొందఁగ సుందరుండు
బ్రతికియున్నాఁడో మృతుఁడైనవాఁడో యనుచుఁ
దలఁచి నిదురించి పొడఁగాంచెఁ గలయొకండు.

సురసాలాన్వితమై సమస్తసుమనస్తోమాంచితామోదసం
భరితంబై మృదుగీతసంగతమరుద్బాలార్హఖేలామనో
హరమై యొప్పు వనంబునందు నొకచో నాసీనుఁడై యున్న సుం
దరుఁ డన్నీలకు నాఁటిస్వప్నమునఁ బ్రత్యక్షంబుగాఁ గన్పడెన్.

అంతట మేల్కాని "మన స్సనోవిభుఁ డిహవ్యాపారముల్ వీడి ని
శ్చింతన్ వర్తిలుచున్నవాఁడు భగవత్సేవాపరుండై సుఖ
స్వాంతుండై సురలోకమం" దనుచు నిస్సందేహభావంబునన్
గాంతారత్నము నిశ్చయించె నకలంకంబైన డెందంబునన్.

ఆ మనోనిశ్చయమ్మున నపుడు పెండ్లి
యయ్యె నీలాకుమారుల కాకుమార
హృదయవాంఛాఫలోదయం బుదితసమ్మ
దంబు నత్యంతసౌఖ్యాకరంబుగాఁగ.

*

## నౌకాభంగము : ౫

ప్రవాసము

అభ్రపరిఘ్రకాలాభ్రఘట్టనభవ
　　　ద్విద్యుల్లతాప్రభావిభ్రమంబు,
రోదసీకుహరనిర్భేదనస్ఫురదుగ్ర
　　　ఘోరగర్జాభీలఘోషణంబు,
వేదండతుండాభవిస్తారవర్షధా
　　　రానిర్గిరోధతీవ్రక్రమంబు,
శుంభద్విహారసంరంభజృంభణభూరి
　　　ఝంఝూప్రభంజనోచ్చాలనంబు,

సంతతాదృశ్యమార్తాండచంద్రబింబ
మండితగ్రహతారకామండలంబు,
మృత్యుదేవతాసంవర్తనృత్యకేళి
కాసమంబు, భయోపాదకము, తుపాను.

ఆవేళన్ ధరణీనభోంతరగతివ్యాపారసంరంభఝం
ఝూవాతూలవిజృంభణాతిశయవిస్తారోగ్రకల్లోలమా
లావిర్భూతమహాభయంకరకరోరారావమై యొప్పు పా
రావారంబున నౌకయొం డరిగె యాత్రాతత్పరత్వంబునన్.

అసితాంభోధరహస్తిరాజగణమై యాలోలవిద్యుల్లతా
ళ్యసిధారానిశితప్రభాపటలమై యాపాతవర్షాంబుర
క్తసరిన్నిర్ఝరమై పయోనిధిసముద్యద్ఘోషభేర్యాదివా
ద్యసముత్పన్ననినాదమై తగెఁ దుపా నవ్వేళ యుద్ధాకృతిన్.

ఆయుద్వేలతరంగసంకలితమౌ నంభోధిపై నాఁడు నౌ
కాయాత్రన్ ఘటియించు నావికులకున్ గల్గెన్ భయోద్రేకముల్
పాయంజాలక యయ్యెడన్ దరణికిన్ భంగంబు వాటిల్లు నే
మోయంచు స్మరణంబు ప్రాప్తమగునే మోయంచు డెందంబులన్.

మిఱుమిట్లు గలిగించు మెఱపుఁదీవ వెలుంగు,
నాశాలవజ్యోతి యంకురించు;
ఫెళఫెళార్భటితోడఁ బిడుగుమ్రోఁత జనించు
విడువఁజాలని దడదడలు వోడము;
గిరులకై వడి లేచి కెరటాలు మిన్నందు,
సత్వరస్వరవాప్తిశంక యొదవు;
అంతరిక్షమునుండి యలలు క్రిందికడంగు,
వాంఛావితానంబు భంగమొందు;

అకట! బయల భయంకరమగు తుపాను,
మనసులఁ గలంగి చెలరేఁగు పెనుతుపాను,
అంతుగానని వార్ధిమధ్యంబునందు
నావికశ్రేణి యోడపైఁ బోవునపుడు.

ఆకల్పాంతమహోగ్రభీకరసముద్రాలోలకల్లోలమా
లాకేళీకలనానుకూలఘనశైలాఘాతజాతమ్ము, నౌ
నౌకాంతూదళనప్రధాన మగుచున్ సంధిల్లె దైవంబునన్
నౌకాభంగ మనేకనావికవితానప్రాణభంగంబుగాన్.

అంతట మృతశేషమగు నావికత్రయం
బీదుకొనుచుఁ బోయి యెట్టకేల
కెటులో చేరుకొనియె నేదియో తీరంబు ;
సుందరుండు మువ్వురం దొకండు.

ప్రాచీదిక్తటలంబివిష్ణుపద
చుంబద్వారిరాశిస్ఫుర
ద్వీచీగర్భగతక్రమక్రమ
శుభావిర్భావమై సర్వతః
ప్రాచుర్యోచితరోచిరభ్యుదయ
విధ్వస్తాఖిలధ్వాంతమై
తోఁచెన్ భాస్కరబింబ మయ్యెడ
జగన్మోదంబుఁ గల్గించుచున్.

మునుముర్గ గ్రమ్మిన వారివాహనిచయంబుల్ వేఁ బటాపంచలై
చనియెన్ గానఁగరానిదవ్వులకు నాశాతీరముల్ దాఁటి యొ
క్కనిమేషంబునఁ, బొల్చె నిర్మలత నాకాశంబు, భానుండు ప్ర
క్తన తేజోనిధియై వెలింగె, విధిసంకల్పం బహో యెట్టిదో.

వెనుతుపాను తాఁకునఁ బొల్పువీడి తరణి
జలధిఁ గ్రుంకిన మఱునిముసంబునంద
తరణి యుదయింప నాశ్చర్యకరము విధివి
లాస మని సుందరుండు తలంచినాఁడు.

ఎదుట నంబుధిఁ గన్గొని పదము నిల్పు
కొనిన భూమీతలంబుఁ గన్గొని తలంచె
నీ వితంబునఁ గడచిన జీవితాను
భవములం గూర్చి యాతండు స్వాంతమందు.

"నారీరత్నము బిడ్డలన్ విడిచి
మున్ నౌకాప్రయాణంబునన్
నా రాశిం జని దూరదేశమున
వ్యాపారంబుఁ గావించి యే
తేరన్ భంగమొనర్చినావు
తరణిన్, దీనంబునన్ దైవమా
యీరీతిన్ ననుఁ బాఱవైచితివి
హా యేమందు నీలీలలన్!

"వ్యాపారంబు నొనర్చితిన్ ధనము సంపాదించితిన్ భావిభా
ర్యాపుత్త్రాదికసౌఖ్యసంపదల నూహల్ చేసితిన్ గాని నౌ
కాపాయంబు ఘటిల్లి యీవిధముగా నొనంచు నీనాఁడు నా
పాపం బీగతిఁ బండునంచు నెపుడున్ భావింపనైతిన్ గదా!

"పటు జంఝానిలపీడనోచ్చలితమై
పాషాణమున్ దాఁకి యొ
క్కటఁ బోతంబు నశించిపోయినది
ముక్కల్ ముక్కలై ; యక్కట
క్కట ! పెక్కండ్రు మృతిం గనుంగొనిరి
నౌకాయాత్రికుల్, గాని యీ
తటముం గన్గొని మేముమాత్ర మసువుల్
దక్కించుకొన్నా మిటుల్.

"నే సమ్మోదమునన్ మనఃపథమునన్
నిర్మించుకొన్నట్టి యా
శాసౌధంబులు నేలఁగూలుచు
వినాశంబందె, నీనూతనా
వాసం బెట్టిదొ, యింక నెన్నఁటికి
సంప్రాప్తించునో ప్రాణకాం
తాసంతానముఖావలోకన
మహానందంబు హా దైవమా !"

అంచు ననేకభంగుల హృదంతరమందుఁ దలంచి యింకఁ జిం
తించిన నేమిలాభము గతించినదాని కటం చెఱింగి ధై
ర్యాంచితచిత్తుఁడై చనియెఁ బ్రాణములన్ విపదబ్ధినుండి ర
క్షించిన యాస్థలంబుఁ బరికింప నతండు సుహృత్సమేతుఁడై.

అవలోకింపఁగ యోగ్యమై మిపులరమ్యంబై వెలుంగొందె మా
నవసంచారమలీమసత్వ మెప్పుడైనన్ సోఁకఁగాలేని య
య్యవనీఖండము దీవిగా నతివిశాలాంభోధిమధ్యంబునన్
దివిషల్లోకము శ్యామలాంబరమునన్ దీపించుచందంబునన్.

వితతాంభోనిధిఁ బొల్చు ద్వీపము శుభాన్వీతోల్లసద్రూపమై
యతిసాంద్రప్రభవిష్ణుభూమిజలతావ్యాకీర్ణతాశ్రీతిర
స్కృతసూర్యాతపతాపమై యవిరతక్రీడైకహేలాచర
త్పతగాళీమధురార్ద్రకోమలగళప్రారబ్ధసల్లాపమై.

కొండబండలఁ జీలుచుకొనుచు వచ్చి
మెలికలుగ నేటవాలుగా సెలయొకండు
వడివడిగ లోయనడుచక్కిఁ బాఱి యెట్ట
కేలకున్ జేరుకొనియెఁ గల్లోలినీశు.

పారావారవిగాహిని ర్ఝరతటప్రాంతంబునం బోవుచున్
వారల్ గాంచి రనేకజంతువిహగానందైకసంచారమున్
సారోదంచితనారికేళకదళీజంబీరపున్నాగస
న్నారంగాదిమహీరుహప్రకరవిస్తారంబుఁ గాంతారమున్.

ఆకాంతారతలంబునన్ మృగనికాయం బెన్నఁడున్ మున్ను మ
ర్త్యాకారంబు నెఱింగియుండమి భయంబావంతయున్ లేక యి
చ్ఛాకేళీకలనన్ బదంబులకడన్ సంచారముల్ సేసె నీ
లాకాంతారమణుండు నాతనిసఖుల్ తద్భూమి వర్తించుచోన్.

చలువల్ దేఱిన పిల్లతెమ్మెరలు నిచ్చల్ నిండు దట్టంపునీ
డల మేల్గందపుమ్రాఁకులం బెనఁగి క్రీడల్ సల్పుచున్ జొక్కపున్
వలపుందియ్యఁదనమ్ములానుచుఁదమిన్ వర్తించు నర్తించుచున్
జిలువల్ నిర్జనకాననాంతరమునన్ స్వేచ్ఛావిహారంబులన్.

ఇరులలో వలపులు సృజియింపఁజాలు బం
గరురంగు గేదంగివిరులపొదలు,
చిలువజాతులకుఁ దావులు గ్రమ్ము కమ్మతె
మ్మెరఁ గాన్కవెట్టు సంపెంగపొదలు,
అలరుఁదేనియ లిచ్చి యెలదేఁటి మొత్తాల
మత్తిల్లఁగాఁ జేయు మల్లెపొదలు,
కఱకుందనపుముండ్ల సరిలేనియందమ్ము
వెలయించు మేల్గులాబిలపొదలు,

ప్రకృతిశోభావిలాసవైభవముఁ జాటు
పలువితంబులపూవుల నలరు పొదలు,
పొదలుఁ గొండలనడుచక్కిఁ బొలుచునట్టి
యేటికెలఁకులఁ గాంతారవాటిలోన.

అచ్చట విచ్చలవిడిగ వి
యచ్చరసంఘము సురాలయంబునఁబోలెన్
హెచ్చినమచ్చికమెయిఁ దమ
యిచ్చమెయిన్ సంచరించు మృగముల్ ఖగముల్.

ఈవల నావలన్ నగము లేర్పడఁ జెంగట నీటియూట క్రిం
దై వడిగా స్రవింప విపులాంబుధి ముంగల గోచరింపఁగా
లోవయొకండు గాంచి యవలోకనరమ్యముఁ బర్ణగేహమున్
నావికు లాశ్రమమ్ముగ నొనర్చిరి శైలగుహాముఖంబునన్.

భూలోకస్వర్గము నాఁ
బోలిన యాదీవియందు ముప్వురు నెటులో
కాలంబుఁ గడపసాగిరి
యాలయములఁ జేరుభాగ్య మమరనిచింతన్.

కాయల్ గూరలు దుంపలున్ ఫలములున్ గష్టంబులేకుండ నా
హా యాహారముగా నిరంతరము సంప్రాప్తించు నాదీవిఁ ; గా
నీ యాత్మప్రియబంధుమిత్రముల కెంతే దవ్వులం దుండి క
ట్టా యచ్చోటఁ బ్రవాసఖేదమున సౌఖ్యంబొంద రన్నావికుల్.

పడవఁ గూల్చిన నాఁటి తుపానుగాలి
తాఁకునకు గాయమొందిన తనువుతోడఁ
జావుబ్రతుకుల నడుమఁ గ్లేశంబు నొంది
హితుఁడు మరణించె నొకఁ డొక యేటిలోన.

అకట మఱికొన్నినాళ్ల కింకొకఁడు గూడ
విధివశంబున నసువులు వీడినంత
మనసులో సుందరుఁడు సుహృస్మరణమునకుఁ
దన వినూత్నైకాకిత్వమునకు వగచె.

హితులంబాసిన సుందరుం డకట తా నేకాకియై మౌనియై
వ్రతదీక్షాపరుఁడైనవానివలెఁ గర్తవ్యంబు వేఱొండు లే
కతిచింతాభరితాంతరంగమున మోక్షావాప్తి నాశించి యే
గతినో కాలము నల్లనల్లఁ గడపంగాసాగె నాదీవిపై.

అవలోకింపఁగ గోచరించినవి యుద్యద్వేగధావత్ప్రతం
గవితానంబులు వ్యోమచుంబివిపులక్ష్మాజాతసందోహముల్
వివిధానేకలతామనోహరసుమాళీసంపదల్ గాని మా
నవరూప మ్మట నామనుష్యునకుఁ గానన్ రాకపోయెన్ గటా!

అలల నుయ్యెలలూఁగు పులుఁగు మొత్తముల
గళసహస్రమ్ముల కలకలమ్ము,
గిరులకై వడి లేచి విఱిగి పైఁబడునట్టి
ఘోరవీచికల గర్జారవమ్ము,
ఆకసంబున గాలి కల్లాడు చెట్లకొ
మ్మల గుసగుసల సంభాషణమ్ము,
ఏటవాలుగ నొక్కపాటునం బడు నేటి
నీటి వేగిరపాటు నిస్వనమ్ము,

కాని వినఁడయ్యె మానవకంఠనాద
మాశ్రమమ్మున వార్ధికి నభిముఖముగ
నాశతో నొక్కపడవకై యకట యెదురు
సూచుచుం గూరుచుండు నాసుందరుండు.

ప్రాచీదిశాపయఃప్లవమానభానుబా
లమయూఖరేఖావిలాసగతులు,
మధ్యాహ్నమార్తాండమండలాఖండాంశు
చండానల జ్వాల మండనములు,
అపరదిగ్వార్ధిమగ్నతపనబింబోత్పన్న
సాంధ్యరాగమనోజ్ఞ శాంతరుచులు,
వియదంతరస్థలీ విన్యస్తతారాస
హస్ర విస్ఫురితహాసాంకురములు,

నిశ్చల నిశాగభీరాబ్ధినిస్స్వనములు,
మఱల సూర్యోదయాదిక్రమమ్మె కాని
కానఁబడదయ్యెఁ బడవ యొకండునైన
దినము లొక్కటొక్కటిగాఁగఁ జనుచునుండ.

అతఁ డాద్వీపమునందు నొక్కరుఁడుఁ బర్వతాగార పార్శ్వస్థితో
న్నతపాషాణమునన్ వసించి యెదుటన్ సంపూర్ణతం దోఁచు న
వ్వితతాంభోధి సదా యదేపనిగఁ దావీక్షించు నౌకాసమా
గతికాంక్షాపరిపూరితాయతనిరీక్షామాలికల్ ద్రిప్పుచున్.

మించినప్రేమమ్మై హృదయమే తనకున్ జిననాఁటినుండి య
ర్పించిన కాంతఁ బాసి కనిపెంచిన బిడ్డలనెల్లఁ బాసి జ
న్మించిన యూరిఁ బాసి తననెయ్యపుజాతినిఁగూడఁ బాసి చిం
తించుచునుండు సుందరుఁడు నిచ్చలు గాఢవియోగవేదనన్.

అంతు గానని యవ్వియోగాతిశయము
వలన సుందరుఁ డొకచోట నిలువలేక
యబ్ధితటమందు వనవాటియందుఁ దిరుగు
వెడఁగుఁదనమున నొక్కొక వేళయందు.

"తలిరుం బ్రాయపుఁ దీవజవ్వనులఁ
జేతఃప్రీతి గాటంపుఁగా
గిళులం జేర్చి యెవో రహఃప్రణయ
వాగ్వృత్తాంతముల్ పల్కుచున్
వలపుల్ నేర్చిన పిల్లతెమ్మెర! నినుం
బ్రార్థింతు నానెయ్యపుఁ
జెలియన్ జేరఁగఁ బోయి తెల్పఁగదవే
శీఘ్రంబ నావృత్తముల్.

"లలితలతావిలాసవతులం దరియంజని పల్లవాధరం
బుల నధికానురాగమున ముద్దిడి తీయని తేనె లాను నో
యళివర! ప్రేమశీలివిగదా, విహరింతువు స్వేచ్ఛఁ, గాన నా
చెలియకు నావిషాదకథఁ జెప్పవె యిప్పుడ పోయి ప్రేముడిన్.

"సరసాంతఃకరణుండవై ఘనుఁడవై సన్మార్గమందున్ నిరం
తర మిచ్ఛాకలనావిహారముల నానందింతు వో యబ్దమా!
చిరకాలాత్తవియోగదుఃఖగళితాశేషాశ్రువుల్ గ్రోలి క్ర
మఱ నానెచ్చెలిచెంగటం గురిసి ప్రేమం దెల్పు మస్మత్కథన్.

“ఆలేమామిడియాకుఁజొంపములలో నాచిమ్మచీఁకట్లలో
నాలీలన్ విరహవ్యథాజనిత దైన్యస్ఫూర్తి శోకస్వనం
బాలాపించు పికంబ! యిమ్మధువుతో యానంబుఁగావించి నా
నీలం గన్గొని మచ్చరిత్రముఁ గృపం దెల్పంగదే యామెకున్.

“వేలాచుంబనసౌఖ్యసంపదలకై ప్రేమంబు పొంగారఁగా
లోలత్వంబున నేగుదెంచు నుఱుకల్లోలంబ! పైశంబ దూ
రాలన్ నాసతియున్నతీరమును జేరంబోయి వాకొమ్ము హృ
త్కాలుష్యంబున నొప్పు నాచరితమున్ గంభీరఘోషంబునన్.”

అనుచు నిజతరుణీవియోగాతిరేక
వేదనాసంజనితమైన విభ్రమమున
నొడలు తెలియక సుందరుఁ డొక్కొకప్పు
డక్కటకట యేమేమొ మాటాడుచుండు.

సారంగాంకకళల్ గనుంగొనుచు
జ్యోత్స్నాశోభ వీక్షించుచున్
దారాకోమల కాంతిమాలికల
సందర్శించుచున్ భూరిపా
థోరాశిన్ దిలకించుచున్ విసువుఁ
జెందున్ సుందరుం డందు నొ
క్కొరీతిం దగు రాత్రులందు
విరహాహీనవ్యథాఖిన్నుఁడై.

"అమరాలయం బెక్కి యటనుండి యీధాత్రి
వీక్షించి వీక్షించి విసువుఁజెంది,
ఏకాకినై తోడు లే కన్యజాతిన
క్షత్రసంతతిలోన సంచరించి,
స్థైర్యంబులేని విషణ్ణనేత్రమురీతి
నశ్రాంతపరిణామ మభ్యసించి,
ఆదిలేని యనంతయాత్ర పౌనఃపున్య
మునఁ గళంకితచిత్తమున మెలంగి,

అకట తావకజీవితమందు శాంతి
లేశమేనియుఁ గైకొనలేక నీవు
నావలెనె పాలిపోవుచున్నావుగావె
యమృతశీతలమూర్తి, నాయనుఁగుసఖుఁడ!

"అతివిరహాతిరేకజనితార్తి కతమ్మునఁ జెల్వుదేఱు నా
సతి చెలువంపుఁజెక్కిళుల సంపదగా, నయనద్వయాంత ని
ర్గత నిరతాశ్రుశీకరపరంపరగా, భవదీయసుందరా
కృతి, భవదంశుముక్తమగు నీహిమవారిఁ దలంచుకొందునా?

"కరముల్ సాఁచి హసించునిన్ను దరియంగాఁబోయిచుంబింప సా
గర ముప్పొంగుచుఁ బొల్చుచున్నది సమగ్రస్ఫూర్తి నివ్వేళ, నీ
కరణిన్ బిడ్డలఁగాంచి ముద్దుఁగొని పొంగంజాలుసౌభాగ్యమో
హరిణాంకా! మఱి నాకు నెన్నఁటికి సంప్రాప్తించునోయక్కటా!

“చలువఁదనంబులన్ మివులఁజక్కఁదనంబుల నీను నీకరం
బుల గిలిగింత లేఁతనగవుల్ తొలుకాడు మొగంబుతోడ న
క్కలువ నెలంత సంతసముఁ గాంచుఁగదా యల తేటనీట ; నా
చెలి యెపు డీగతిన్ సుఖముఁ జెందునొ మత్కరబంధనమ్మునన్.

“అకటా ! నా ప్రియురాలి నీలికురులం దందంబులం జెందు మ
ల్లికలన్ జ్ఞప్తికిఁ దెచ్చి శోకపుశిఖల్ మేల్కొల్పి యేడ్పించి యూ
రక మీ రీహతభాగ్యునిన్ నగవుపాల్గావింతురా నేఁడు తా
రకలారా సురలోకభోగవిభవప్రాప్త్యావలేపంబునన్ ?

“చిరవిరహవ్యథానుభవజీవితమందు సుకమ్ము లేక రా
తిరియుఁబవల్ విషణ్ణత నదేపనిగా విలపించుచున్న నా
తెఱఁగున జోడుఁ బాసి నినదించెద వీనిసి దుఃఖగీతి, భా
స్కరునుదయమ్మునన్ సుకముఁగాంతువు నావలెఁగాక చక్రమా.”

అనుచుఁ బరిపరివిధముల నంతరంగ
మందుఁ దలపోసి విలపించు సుందరుండు
అంతులేని ప్రవాసంబు ననుభవించు
కొనుచుఁ దఱుగకవచ్చు యామినులయందు.

ఆతం డొక్కొకవేళఁ బర్ణనిలయప్రాంతప్రదేశంబునన్
ఱాతిన్నన్ వసియించి ధ్యానగతముద్రాపారవశ్యంబునన్
జేతోవీథుల సంచరించు నెడ నాసీనంబగున్ గీటక
వ్రాతం బౌర తదీయనిశ్చలతనూభాగంబునం దిచ్చమై.

మౌనముఁబూని తాపసునిమాడ్కి నిమీలితనేత్రయుగ్ముఁడై
ధ్యానవిలీనుఁడై తగు నతండు కనుంగొను నంతరంగవీ
థీనిచయంబులన్ స్ఫుటముగా నెదుటన్ బొడకట్టినట్లు పూ
ర్వానుభవాభిరామవివిధాకృతులన్ నిజభావవీథులన్.

కడలియొడ్డున నేరుపడు కొండదండల
నడుచక్కిఁ బెంపెక్కు యడరు పల్లె,
పశ్చిమమ్మున మేటివనవాటి, మున్నీటి
కెరటాల కెదుట రాగిల్లు నిల్లు,
కేల బాలుని లీలఁ గీలించి లాలించి
పాలిచ్చునట్టి నీలాలతాంగి,
జిలిబిలి తేనెమాటల నాటపాటల
ముచ్చటల్ గలిగించు ముద్దుబిడ్డ,

లాత్మవృత్తియోగ్యమ్ము నౌకాశ్రయమ్ము,
పరిచితములైన మొగములు, మఱలమఱలఁ
గనులఁగట్టినచందాన దృష్టిపథము
నందు గోచరించుచునుండు సుందరునకు.

ఊహాస్రోతులఁ బూర్వజీవితకథావ్యూహంబు నానందసం
దోహంబుంగని కొంతసేపటికిఁ గన్నుల్విచ్చి యాసుందరుం
డాహా చింతయుఁ గిన్కయుంగొను,ఘనంబై సుందరంబయ్యు నెం
తేహేయంబుగ నయ్యెడం దనరు నాద్వీపంబు కన్పట్టఁగన్.

"అక్కట! నిన్నుఁ బాసి విరహాగ్నివశంబున దిక్కుమాలి నేఁ
డిక్కడఁ గుందు నీవిధురుఁ డెన్నఁటికిన్ మఱవంగలేఁడుగా
చక్కనినీల! నీచెలిమి చక్కిలిగింతల నాటపాటలన్
మక్కువమాటలన్ గడుఁదనర్చిన చిన్నతనంపుముచ్చటల్.

"కనులన్ గన్నులు, నవ్వులో నగవెసంగన్, మాటలో మాటయున్
మనసందున్ మనసున్ మెలంగఁగ మనోజ్ఞప్రేమసౌభాగ్యమై
యనుకూలస్థితియోగ్యమై యవిరతైక్యస్ఫూర్తి శోభిల్లు నా
మనదాంపత్యము నెచ్చెలీ మఱవ నాత్మన్ జన్మజన్మాలకున్."

అనుచు ననివార్యచింతాసమన్వితాంత
రంగుఁడై సుందరుండు నిరంతరమ్ము
తనదు ప్రియురాలిఁ గూరిచి తలఁచి తలఁచి
కరము విలపించుఁ గీఱని కాంక్షతోడ.

అకటా మృత్యువుఁ గాంచియుండఁడె యతం డా హేయమా దీవిపై
సకలాంతర్గతుఁడై స్వభక్తజనరక్షాదక్షుఁడై యార్తినా
శకుఁడై తన్నలరించు నీశ్వరునితో సంభాషణల్ సేయుచుం
డక యున్నన్ దనయొంటిపాటుకతనన్ స్వాంతంబు భగ్నంబుగన్.

ఆత్మబంధుమిత్రముల యాస్యములఁ గనఁగఁ
బరిచితప్రదేశంబులఁ బదములిడఁగ
నా ప్రవాసి విషణ్ణహృదంతరమున
నాశమాత్రము నాశనమంద లేదు.

ఆగతిం బ్రవాసియగు సుందరుఁ డచిర
కాలమంద వార్ధకంబు నంద
నేటనేట ఋతువు లేతెంచి యొకదాని
వెంట నొకటిగాఁగ వెడలసాగె.

కారాగారనివాసముం దొఱఁగి మోక్షంబందు ఖైదీగతిన్
బారావారమునుండి వెల్వడె జగద్బంధుండు ప్రాచీదిశా
ద్వారస్ఫారకవాటముల్ విడివడన్ వక్త్రంబునన్ నూతన
స్మేరాంకూరవికాసకోమలరుచిశ్రీ మీఱఁగా నయ్యెడన్.

అపుడు పొడకట్టె వారాశియలలయందు
శ్రీకరాలోకములు విలసిల్ల నరులఁ
బటుతమస్సముద్రమునుండి తటముఁ జేర్చు
తరణిచందంబునం జగద్బాంధవుండు.

పారావారమునన్ బ్రభంజనహతిన్ బల్మాఱు లట్టిట్టులై
దారిందప్పిన పోత మయ్యుదయసంధ్యావేళ నొక్కండు తాఁ
జేరన్వచ్చిన దెట్టకేల కచటన్ జెన్నొందు నాద్వీపపుం
దీరంబున్ మధురాంబుపూరముల నర్థింపంగఁ దన్నావికుల్.

విమలజలములకొఱకు నన్వేషణంబు
సలుప నావికుల్ గొంద ఱచ్చటికి వచ్చి
తటమునెల్లఁ గోలాహలధ్వనులతోడ
నింపివైచి రుత్సాహంబు నివ్వటిల్ల.

పెరిఁగి దీర్ఘంబైన గరువంపుగడ్డమ్ము,
జడలుగట్టిన కేశసంచయమ్ము,
అటవీమృగభ్రాంతి ఘటియించు రూపమ్ము,
మైఁదోఁచు వింతయాచ్ఛాదనమ్ము,
గలిగి యర్థమ్మేమొ కనుఁగొనంగారాని
యంగసంజ్ఞలఁ జేసి యంతలోనఁ
బిచ్చియెత్తినవానివిధమున మెల్లగా
గొంతులో నేమేమొ గొణఁగుకొనుచు,

అపుడు డిగివచ్చెఁ గొండలోయనడుచక్కి-
నుండి క్రిందికి, నావికుల్ మెండుగాఁగ
డెందములయందు నాశ్చర్యమొంది చూడ
వింతమానిసియైన యేకాంతజీవి.

అంతఁ దనవెంట నావికు లరుగుదేర
ముందునకుఁ బోవఁగాసాగె సుందరుండు
స్వచ్ఛములు మధురంబులై యలరునట్టి
నీరములఁ బాఱు నొకసెలయేఱు సూప.

అకట చిరకాలవిరహమ్ము ననుభవించి
కట్టువడి మూఁగయైనట్టి గళము తుదకు
నాఁడు చెఱఁదొఱంగినది మానవులచెలిమి
కలిమికారణమునఁ గ్రమక్రమముగాఁగ.

జలకోశమ్ములనెల్ల నింపుకొని హర్షంబొందు నన్నావికా
వళికిం దెల్పెఁ గ్రమక్రమాత్తమగువిశ్వాసంబుఁ బుట్టించుచున్
గళబంధంబు విడంగ దీర్ఘమగు నేకాకిత్వ మవ్వేళ న
వ్వలకుం బోవఁగ సుందరుండు సకలంబున్ నైజవృత్తాంతమున్.

నావికులతోడ నపుడు సుందరుఁడుగూడఁ
గడలి నూఁగాడు ప్రేమంపుఁబడవ నెక్కె;
నాతని విషాదవృత్తాంత మాలకించి
కరఁగి రెల్ల రెదల జాలి క్రందుకొనఁగ.

యానంబున్ బొనరించె నంబునిధిపై నయ్యోడ యెట్టెట్లొ
కానీ, యాగతిఁ గొన్నినాళులుసనంగా నావికుల్ సుందరుం
డేనౌకాశ్రయమందుఁ దొల్దొలుత మున్నేనాఁడొ బైల్దేఱినాఁ
డానౌకాశ్రయమంద డించిరి కృపాయత్తాత్ములై యాతనిన్.

*

# నౌకాభంగము : ౬

ఆవేదన

ఆలోకమ్ములు పొల్పువీడ నవసంధ్యారాగశోకానల
జ్వాలల్ నిండఁగ వార్ధకంబున జగద్బంధుండు దుఃఖించెఁ బ్రా
ణాలంబంబెదియున్ గనుంగొనక పూర్వాశావియోగార్తి, న
వ్వేళన్ జీవనపాతయోగము సమీపింపన్, ప్రశాంతాకృతిన్.

ఆశ విఫలమ్ముగాఁగ శోకాగ్నికీల
లెగసి మిగుల దహింప సహింపలేక
పగిలిపోయినహృదయంబుపగిది నరుణుఁ
డపుడు చెట్లకొమ్మలసందులందుఁ దోఁచె.

విరులరేకుల చెలువమ్ము కొఱవడంగఁ
దలిరుటాకులు జీర్ణించి తలఁగిపోవ
మ్రోడువోయిన మ్రాఁకులో మూఁగవడిన
హృదయవేదన యెట్టిదో యెఱుఁగరాదు.

వేదనాభారమునఁ బొలుపేది యడఁగు
నెడఁదకై వడి మెల్లనఁ బుడమిమీఁద
జీవముడిగి శుష్కించిన జీర్ణదళము
బరువుగా రాలిపడె శీతవాతహతికి.

చలువల్ దేఱిన వాతపోతములు విస్తారంబుగా మేను కం
పిలులీలన్ బ్రతికూలమైనగతులన్ వీవన్ దినాంతంబునన్
దలఁపుల్ భావివిపత్సమాగమవిషాదప్రాప్తిలగ్నంబులై
కలఁగన్ సుందరుఁ డింటివంక నడువంగాసాగె నేకాకియై.

ఎవ్వనిమోముఁ గన్గొనక యెవ్వనితో నొకమాటయైన వా
క్రువ్వక మోమువాంచి యువలోకనజాలము నేల వ్రాలఁగా
నవ్విరహార్తుఁ డింటిమొగమై నడువంగఁదొడంగె, నక్కటా
యివ్విపులప్రపంచమున నింకమఱెక్కడియిల్లు వానికిన్ ?

సుందరుం డాగతింబోయి సందెవేళ
మూసికొనివచ్చు చీఁకటిమూఁకలందు
నగపడియు నగపడక దయ్యమ్మువోలెఁ
బాడువడియున్న తనయింటి జాడఁ గాంచె.

నీలాసుందరి యింట వర్తిలునెడన్ వింద్రై చెవిన్ సోఁకు నా
చేలోత్కస్వరమో, మనోజ్ఞపదమంజీరోదితస్వానమో,
కేలంగల్గిన కంకణక్వణనమో, కేళీచరద్బాలికా
బాలారావమొ యేదియేని వినిపింపన్ లేదు నాఁడయ్యెడన్.

అలికిడియెలేక దీపపువెలుఁగెలేక
మృతిఁగనినలీలనున్న యాయింటిఁ జూచి
యతఁడు తలపోసె నిటు : "మృతమైన దేమొ
యకట నాకుమాత్రమె మృతమైనదేమొ."

తనకుఁ బరిచితుఁడైన యుదారనిర్మ
లాత్ముఁడొకఁ డుండె నాయూర, నతనియిల్లు
జ్ఞప్తికిన్ రాఁగ నాఁడు దానఁ దలదాఁచు
కొనఁదలంచి యచ్చటినుండి చనియె నతఁడు.

అది యొకపురాతనంబైన యాలయంబు ;
అదియు గతియించెనేమొ యటంచుఁ దలఁచె
సుందరుఁడు, కాని నివసించె నందు నొక్క
విధవయును వృద్ధురాలు నౌ పేదరాలు.

ఆనిరుపేదరాలి నిలయంబున సుందరుఁ డొక్కరుం డొరుల్
గానని లీల నేకతముగాఁ గడపెన్ బహువాసరంబులన్
మానని వేదనాభరము మానసముః గలగుండు వెట్టు లో
లోననె మూఁగదుఃఖములు క్రూరములై విహరించుచుండఁగన్.

అకట దీర్ఘప్రవాసవ్యథానుభవము
వలన నంగబలము మనోబలముఁ బాసి
క్రుంగిపోయిన యాసుందరుని మొగమ్ముఁ
జూచి యావృద్ధురాలు పోల్చుకొనదయ్యె.

మిగుల వాచాలయైన యమ్ముగువ యతని
తోడ నేమేమొ యెపుడు మాటాడుచుండు ;
ఊరికథలతోఁ బాటుగా నొక్కనాఁడు
నీలకథకూడ నామె వానికి వచించె.

అతని లేఁబ్రాయంపుసుతుని దుర్మరణంబు,
పెంపునొందిన యామె పేదఱికము,
బాలికాబాలురఁ బాఠశాలకుఁ బంపి
యాకుమారుఁ డొనర్చినట్టి మేలు,
అతని చిరప్రణయకథాభిధానంబు,
కడ కామె సమ్మతి యిడినవిధము,
వారి ప్రేమంపువివాహంబు, నీల చ
క్కఁదనాలబాలునిఁ గన్నవార్త,

పూసగ్రుచ్చినయట్టు లప్పొలఁతి నుడువ
నాలకించిన యాధీరు నాననమునఁ
గాంతి సెడలేదు, భావవిభ్రాంతిలేదు,
చలనమే లేదు, మాఱుపే కలుగలేదు.

అపుడు తుది నామె "సుందరుఁ డక్కటకట
యెడకో పోయి గతియించినాఁడు పాప"
మనఁగ జాలిగాఁ దలయూఁచి యతఁడు ననియె
"నెడకో పోయి గతియించినాఁ" డటంచు.

ఆవాక్యమ్ము బలమ్ములేక స్వరహైన్యంబందు కంఠంబునం
దావిర్భావముఁగాంచి తాఁ గ్రమముగా నంతంత క్షీణించి త
ద్భావాభ్యంతరమందు నేయడుగునో ప్రాపించి వేమాఱుగా
నావేళన్ జలియించి డాఁగిన దనన్యశ్రావ్య మజ్ఞేయమై.

పున్నమచందమామపొలుపుల్ నవవెన్నెల నీన నొప్పు న
య్యన్నులమిన్న ముద్దుమొగమక్కట యొక్కక్షణమ్ము మాత్రమే
కన్నులకర్వ్వదీఱఁ గనఁగా హృదయమ్మున నాఁడునాఁటి క
భ్యున్నతి నొందుకోరిక వియోగికిఁ గల్గి వ్యథించె నెంతయున్.

ఆచిరస్నేహవతి నీల యాననంబుఁ
గాంచి యామె కరంబు సుఖించుచుండె
నని యెఱింగినచోఁ దన కంతె చాలు
నదియ తుదికోర్కి యాతనిహృదయమునకు.

ఆఁపుకొనంగరానిదగు నా పెనుగోరిక యగ్గలంపురా
రాపులువెట్ట వానియెద ఱంపపుఁగోఁతలు కోసి తీవ్రసం
తాపముఁగూర్చి గాటముగ నాటుకొనంగఁ గ్రమక్రమంబుగా
నోపికఁబూని నిశ్చలత నుండఁగ సుందరుఁ డోడె నక్కటా !

పాడగునింట నిచ్చమెయివర్తిలు దయ్యమువోలెఁ, గానలోఁ
బోడిమిదప్పి మర్మరముపుట్టఁగ వాయుపథంబునందు న
ల్లాడెడు నెండుటాకువలె నాతనిమానసమెల్లఁ దానయై
పీడనివాంఛితం బొకఁడె పీడ ఘటింపఁదొడంగె నక్కటా!

ఆయాకాంక్షయ కాళ్లనీడ్వ నొకనాఁ డాసుందరుం డొక్కఁడున్
సాయంకాలమునన్ గుమారగృహపశ్చాద్భాగశోభాకరం
బై యొప్పారుమనోహరంబగుసుమోద్యానంబునొయ్యొయ్యనన్
డాయంగాఁజనె డెందముం గలఁతవెట్టన్ భావచాంచల్యముల్.

ఎత్తుగనున్న యాస్థలము నెట్టులొ చేరిన యావియోగి తా
నత్తటి నాఁగి యొక్కయుపలాంకమునన్ వసియించి క్రిందికిన్
మొత్తముగా మఱల్చిన కనుంగవచూపులఁ జూచినాఁడు మొ
లెక్కత్తిన సాంధ్యరాగరుచు లెల్లెడ నల్లుకొనంగడంగఁగన్.

అక్కడఁ గూరుచుండునెడ నాతనియుల్లమునందు మూఁగలై
యక్కట పూర్వజీవితకథానుభవస్మృతు లెన్నియేనియున్
లెక్కకుమిక్కుటంబుగఁ జలింపఁదొడంగె మహాంబురాశియం
దొక్కటివెంట నొక్కటిగ నూర్ములు పైఁబడి వచ్చునైకెవడిన్.

అంత నించుకదూరమునందు నతఁడు
కనుఁగొనెఁ గుమారు నుద్యానవనతలమ్ము,
వినియె నప్పుడ వీనులవిందుగాఁగ
మోహముం గొల్పు కంఠకోలాహలంబు.

ఆకేళీవనవాటికాంతరమునం దావేళ నుత్పన్నమై
యాకంఠస్వరమే కరంబుఁ గమనీయంబై శ్రవఃపేయమై
యాకర్షించె విషాదయుక్తమతియా నవ్వాని నాత్మప్రభా
నీకంబున్ గని కాంతుసేయుపురుగున్ దీపంబు చందంబునన్.

పూవులుపూచు భూమిరుహముల్ కదళీతరువుల్ తమాలముల్
మావులు నారికేళములు మంజులతల్ చెలువమ్ముఁగూర్పఁగా
నావనవాటి రమ్యముగ నయ్యెడ నాలుగుప్రక్కలందుఁ గు
డ్యావరణంబు పశ్చిమమునం దొకద్వారము గల్గి భాసిలెణ్.

తొందరలువెట్టు కోరికన్ సుందరుఁ డపు
డావనంబు సమీపించి యందుఁ గల్గు
నడిమిమార్గంబునం దడుగిడక గోడ
నంటి మెలమెల్లగా దొంగయట్టు లేగె.

ఏగి యొక్క రసాలమహీరుహంబు
పొంత డాఁగొని తృష్ణాప్రపూరితంబు
లైన నయనమ్ములన్ రహస్యముగఁ జూచె
నకట చూడంగరాని దృశ్యంబొకండు.

చిన్నప్రాయంబునన్ దోడిచెలిమికాఁడు
వయసువచ్చినతఱిఁ దోడివలపుకాఁడు
నగు కుమారుఁడు మోకాళ్లయందు నాడు
కొంచు హాసియించు సుతునిఁ జుంబించినాఁడు.

నవలావణ్యవయోవిలాసవతి కన్యారత్నమొక్కర్తు రెం
డవతండ్రిన్ భుజసీమ నాని కరవిన్యాసంబుమై నాటవ
స్తువునందించుచు నాసఁగొల్పి కయికొంచున్ నవ్వుచున్ గేళికా
ప్తవినోదంబునఁ జిన్నితమ్ము నలయింపన్ సాగె హర్షంబునన్.

కేళీలోలతఁ జెండు బాలకుఁడు కెంగేల్సాఁచి యాశావిశా
లాలోకంబులఁ గాంచి దానిఁగొనఁగా యత్నించియత్నించి కై
కోలేకుండుటఁ జూచి నాల్గుదెసలన్ గోలాహలధ్వాన మ
వ్వేళన్ నిండఁగ నవ్విరెల్లరు కడుంబెంపొందు మోదంబునన్.

సమ్మదలీల నీల వికసన్ముఖహేల కుమారవామపా
ర్శ్వమ్మునఁ గూరుచుండి పసిప్రాయపుబాలునిఁ బ్రేమలోలనే
త్రమ్ముల మాటికిం గనుచుఁ బ్రక్కన నిల్చిన పెద్దవానితో
నిమ్ముగ నేమొకాని వచియించుచునుండెఁ బ్రియమ్ము పెంపునన్.

ఒకనాఁడు తనభార్య యొకట యింకెక్కడి
తనభార్య పరునితో మనిన నీల ;
ఆమెపుత్త్రుఁడెకాని యాత్మపుత్త్రుఁడుకాఁడు
జనకునంకమునందుఁ దనరుబిడ్డ ;
తనదుపిల్లలెకాని తనవత్సలత లేక
పరునివాత్సల్యంబుఁ బడయువారు ;
ఆత్మసామ్రాజ్యసింహాసనం బదికాని
యాక్రమించినపరుం డాకుమారుఁ ;

డక్కటక్కట యెల్లరు నొక్కచోటఁ
జేరి యానందవార్ధివీచికలలోన
నోలలాడుచు సౌఖ్యంబు నొందుచుండఁ
జూచె మరణించి బ్రదికిన సుందరుండు.

విన్నదానికంటెఁ గన్నది ప్రబలత
రమ్ముగాదె భూతలమ్మునందు ?
వృద్ధురాలివలన విన్న వృత్తాంతంబయ్యెఁ
గన్నులార నేఁడు కన్నకతన,

ఆకంపింపఁగ జీర్ణదేహమఖిలం బాపాదమస్తంబుగాఁ
జీఁకట్లొక్కటఁ గ్రమ్మ లోచనములన్ జిత్తంబు ధైర్యచ్యుతిన్
జీకాకొందఁగ గుండెకొట్టుకొనఁగా నిల్వంగలే కప్పు డే
ట్లో కేలెత్తి యతండు ప్రాపుగ రసాలోర్వీజశాఖం గొనెన్.

త్రుటిలోనన్ జగమెల్లఁగూల్చు ప్రళయోన్మత్తోరుగర్జారవం
బటులాహృష్టకుటుంబసౌఖ్యవిభవవ్యాపారసర్వస్వ మొ
క్కట నాశంబొనరింపఁజాలు నొక కేకం బెట్ట నుంకించి య
క్కట భీతిల్లి యతండు నిల్చుకొనియెన్ గంరాన నెల్లనియున్.

అతఁ డచ్చో నిలువంగలేక యపు డయ్యారామకుడ్యంబు హ
స్తతలస్పర్శ మొనర్చి యానుకొని నిశ్శబ్దంబు మందంబు నొ
గతిఁ బాదంబులు దొంగవోలె నిడుచున్ గాఢప్రయాసంబు నొం
ది తుదిన్ భూరివిశాలవిశ్వమున కేతెంచెన్ బ్రయత్నంబునన్.

అందనుక వాని కాళులయందు నిలిచి
యున్న యావంతశక్తియు నుడిగిపోయె ;
బైటఁ బడినంత నాతఁ డోర్వంగలేక
నిలువునం గూలఁబడినాఁడు నేలమీఁద.

కనులఁ నిల్చిన యుష్ణబాష్పచయమున్ గంరప్రదేశంబునం
దు నిరుద్ధంబగు రోదనస్వనముఁ జేతోబద్ధమై డాఁగియుం
డిన దుఃఖంబును బట్టువిడి యకటా నిండారనుప్పొంగి యొ
క్కని మేషంబున బైటకున్ వెలువడెన్ గాఢమ్ములై యత్తఱిన్.

"ఎంత దుర్భర మీబాధ! యెంతకఠిన!
మింత యీవేదనాభార మింత దుఃఖ
మకట సహియింపలేదు మోయంగలేదు
నవసినవసి కృశించిన నాయెడంద.

"మర్త్యసంపర్కమున మలీమసత లేశ
మైన నొందని యీరహస్యస్థలమున
నన్ను నాయొంటిపాటు నుండంగనీక
యిచ్చటికిఁ గొనితెచ్చినా రేల వారు?

"ఓయార్తావన! సర్వశక్తిభరణా! యోసర్వలోకేశ్వరా!
ఆయేకాంతపుదీవిపై నొకఁడనై యీవేదనం బొందఁ బ్రే
మాయత్తాత్ముఁడవై ననున్ విసువులే కన్నాళ్లు రక్షించినా
వీయేకాంతమునం దొకింతతడ వింకెల్లని కాపాడవే?

"ఆవంతేనియు వంత నొందక కుటుంబానందఖేలన్మనో
భావస్ఫూర్తి వహించు నామెసుఖముల్ భగ్నంబు కాకుండఁగా
నావృత్తాంతము నామె కెన్నఁటికినైనన్ దెల్పకుండంగ నో
దేవా! దుర్బలమైన నాయెదకు శక్తిం గూర్చి రక్షింపుమా.

"జ్ఞానవికసన మింతయుఁ గానరాని
మొగ్గప్రాయానఁ బుత్రియుఁ బుత్త్రకుండు
నన్ను నెడఁబాసి మఱచిరి నాకు నేన
తెలిపికొని వారితోనైనఁ బలుకుటెట్లు?

"మూడుమూర్తులఁ దల్లినిఁ బోలినట్టి
బాల! తండ్రినిఁ బోలిన బాలకుండు!
అకట! వారలఁ గాంచు భాగ్యంబయేని
లేదు నాకింక, వారి నేలీల మఱతు?"

అని తనకుఁదాన యతఁడు మాటాడుకొన్న
పట్టునన్ భాషణమునకు భావమునకుఁ
బ్రకృతికింగూడ నొకయింత భంగపాటు
కలిగె; మూర్ఛిల్లినాఁడు నిశ్చలత నతఁడు.

ఆత్మకథ నెఱిఁగింపరా దామె కన్న
భావమొక్కటె యాతని స్వాంతమందుఁ
గొట్టుకొనెఁ డక్కుటక్కునఁ గొంతవడికి
నతఁడు తెలివొంది గృహమున కరుగునపుడు.

ఆవేళన్ నిబిడాంధకారపటలం బభ్రంబునం గ్రమ్మ శో
భావంతంబులు తారకానికరముల్ భాసిల్లె నవ్వాని హృ
ద్భావాభ్యంతరమందుఁ గ్రమ్ముకొను చింతారాసులన్ దత్ప్రతి
జ్ఞావిస్ఫూర్తి సుఖప్రదంబుగ వెలుంగంజాలు చందంబునన్.

ఆత్మవిశ్వాస మీశ్వరధ్యాననిరతి
నిజహృదంతరకృతమైన నిశ్చయమ్ము
బలము నుత్సాహముం గూర్పఁ బడసె నతఁడు
తృప్తి నంతిమక్షణమున కెదురుగనుచు.

ఉల్లమునం దొకింతసుఖ మొందియు నానిరుపేదరాలితో
నల్లననీగతిం బలికె నాతఁ: "డొకించుకయైన భీతిసం
ధిల్లకయున్న నీవు మునుదెల్పినయట్టి కుమారుభార్యకున్
దొల్లిఁటిభర్త జీవములతో నిపు డుండునటంచు నాత్మలోన్?"

అనినఁ జిఱునవ్వు నవ్వుచు ననియె నామె
యీవిధంబున : "నహహా ! యింకేటిభయము ?
అతఁడు మరణించె నని యెవఁడైనఁ దెలుపు
నేని యామెకు నదియె సంతృప్తికరము."

అదిమొదలుగా నతఁడు నిశ్చితాత్ముఁ డగుచు
బిచ్చ మెత్తుకొనఁగ నాత్మనిచ్చగింప
కన్యసాహాయ్య మనిన హేయముగ నెంచి
చేయసాగె స్వాతంత్ర్యైకజీవనంబు.

*

# నౌకాభంగము : ౨

ప్రాణచ్యుతి

కొక్కొరోకోయంచు దిక్కులన్ నినదించు
మూడుభంగులతోడి కోడికూఁత,
వృక్షశాఖలయందుఁ బక్షిసంతానంబు
తెలివొంది యొనరించు కలకలమ్ము,
గొల్లచేడియ లిండ్లఁ జల్లసేయఁగ నింపు
పెంపారఁ బొడము కవ్వంపుమ్రోఁత,
పాఁడియావుల గుమ్మపాలధారలు జాఱ
నావిర్భవంబందు నారవంబు,

మెల్లగా వీచు పిల్లతెమ్మెరల పలుకు,
కడలి బెడిదంపుఁగెరటాలు విడువని రొద,
వింతమేళన మొంది కావించె మివుల
వీనులకు విందు వేఁకువవేళయందు.

తను వారోగ్యముఁబాసి తల్పమునకుఁ దక్కంగ నవ్వేళ నా
ధ్వనిసమ్మేళనమందు నీశ్వరునియాహ్వానంబె వేవేగ ర
మ్మనుమానింపకు మాలసింపకుము రమ్మన్నట్లు కర్ణద్వయం
బున స్పష్టంబుగ సుందరుండు వినె నామోదాన్వితస్వాంతుఁడై.

ఆలోకమ్ములసంజ్ఞలన్ మృదుకరన్యాసప్రసారంబులన్
లోలత్కోమలమందహాసములఁ దన్నున్ రమ్మురమ్మంచు న
వ్వేళన్ బిల్చెడు దేవదూతలవలెన్ వెల్గొందికన్పట్టె దూ
రాలన్ విష్ణుపదాంచితంబులగు తారాజాలముల్ వానికిన్.

ప్రోవులుగా నిరుల్ జగతి
మూఁగిన వేఁకువవేళ శ్వేతశో
భావిభవంబు పూర్వదిశపై
వికసించినరీతి నయ్యెడన్
జీవితఖేదవేదనల
శీఘ్రముగాఁ దొలఁగించునట్టి యా
భావిసమీపమృత్యువు
శుభప్రదమై కనుపట్టె వానికిన్.

చీఁకటు లావరించుకొను
జీవితశర్వరికిన్ మనోజ్ఞమా
వేఁకువయై యెసంగు మృతి
వే దరియన్ గనె నాతఁ డొక్కయా
శాకిరణమ్ము, ప్రాణము
పొసంగినయంతకు నామెమీఁదఁ బ్రే
మైకతఁ దాను నిల్పెనని
యామె యెఱుంగునటంచు నెంచుచున్.

కొలఁకులం బులికించి మొలఁకువన్ గాంచు త
మ్ములకులమ్ముల నవ్వుమొలక లలర,
ముదమూని మధువాని మదమెక్కఁ గొదమతు
మ్మెదకులమ్ముల పెనురొదలు గదుర,
కవఁగట్టుకొని మోహవివశతం జొక్కఁ జ
క్కవకులమ్ముల కువకువలు వెలయ,
గరువంపుఁదరఁగతుంపురు లింపునింప తె
మ్మెరకులమ్ముల నవాంకురము లొలయ,

ప్రకృతి యకృతకానందసంపదల నొంద,
దెసల నసమానవికసనోల్లసన మెసఁగ,
నపుడు గనన య్యెఁ బ్రాచీదిశాంగణమున
నుదధిగర్భంబునందు భానూదయంబు.

శయ్యకు దేహభారము నొసంగి విముక్తినిగోరు సుందరుం
డయ్యెడ జాలమార్గమున నయ్యినునిన్ దిలకించి యెంచె "నా
నెయ్యపుమిత్రుఁ డిష్ట రమణీయకరమ్ములు సాఁచి నన్ను నో
య్యొయ్యనఁబిల్చునింక నిటనుండక పోయెద" నంచునాత్మలోన్.

ఆయుదయసమయంబునం దతఁడు తన్ను
నాదరించిన యావృద్ధురాలిఁ జేరఁ
బిలిచి యీరీతి మెల్లనఁ బలికినాఁడు
గళము వెలువడు సన్నని యెలుఁగుతోడ,

"పడఁతి ! సహాస్యమొందు తెలుపంగఁ గలిగిన వాఁడ నీకు ని
య్యెడ ; విన నెంతువేని యది యెవ్వరికేనియు నాదు ప్రాణముల్
వెడలెడునంతదాఁకఁ బ్రచురింపక యుండఁగఁ జేతిలోనఁ జే
యిడి మఱియొట్టు వెట్టుకొను మీమనుమున్ పరమాత్మసాక్షిగా."

అనిన "నిదియేమి వింత ! మాటాడుచుండ
మృత్యువేమిటి ! నీరోగ మిప్పుడె కుదిరి
పడయు దారోగ్య మెప్పటివలె" నటంచుఁ
బెద్దగొంతునఁ బలికె నా పేదరాలు.

"ఒట్టుఁ బెట్టుము తొలుత !" నం చొక్కసారి
తీక్ష్ణముగఁ జూచి యతఁడు గద్దించి పలుక
నించుక భయంబు నొంది యయ్యింతి యట్ల
చేసి నాతని చేతిలోఁ జేయి వైచి.

"ఓయమ్మ ! సుందరుండన
నీయూరన్ మనిన యాతఁ డెఱుక యె నీ ?" కం
చాయత వీక్షా మాలిక
లాయంగన వంకఁ ద్రిప్పి యతఁ డడుగుటయున్.

[నా

"అతఁడా? యెన్నఁడో మున్ను నాకెఱుక; యానావాని రూపంబు
స్మృతికిన్ దోఁచుచునున్న దిప్పుడయినన్ ; శీర్షంబుఁ బైకెత్తి యు
న్నతుఁడై యెవ్వరినేని లెక్కిడక యాతం డేగుచో వీధిఁ గాం
చితి నేనన్నియొసారు" లంచు వచియించెన్ వృద్ధురాలంతటన్.

"అతనిశీర్షంబు కడునవనతము, వాని
లెక్కసేయువారెవ్వరు లేరు నేఁడు ;
అకట యింక నే బ్రతుకఁజాల నధిక కాల
మతఁడె నే" నంచు మెల్లన ననియె నతఁడు.

"ఏమి ! యిదియేమి ! సుందరుఁ డీవె నీవె ?
అతఁడు నీకంటె మిగుల నున్నతుఁడు ! నమ్మఁ
జాల నీకను" లనుచు నాశ్చర్యచకిత
యగుచుఁ దెఱచిననోట నమ్మగువ పలికె.

అక్కరణిన్ జెలంత పలుకాడఁగ నీగతిఁబల్కె సుందరుం :
"డక్కట ! దుస్తరవ్యథల నంతముగానని యొంటిపాటునన్
జిక్కితిఁ గ్రుంగిపోయితిఁ గృశించితి దైవము యిట్లుసేయ నా
కెక్కడిపూర్వభాగ్య మిఁక నెక్కడియున్నతి జీవితంబునన్ !

"ఐన నిది యదార్థమని యెఱుఁగఁ దగు
నలకుమారుఁ బెండ్లియాడె నెవతె,
యామె మున్ను పెండ్లియాడియుండినయాతఁ
డీతఁడే యటంచు వృద్ధురాల !"

ఘనపాథోనిధియానమున్ బిడప నౌకాభంగమున్ దీవిపైఁ
దనయావాసవిధమ్ము, నాగమనవృత్తాంతమ్ము, నీలావలో
కనగూఢక్రమమున్, బ్రతిజ్ఞయుఁ బ్రతిజ్ఞాపాలనంబున్ వచిం
చె నతం డాత్మవిషాదవృత్తముగ నిశ్శేషంబుగా నామెకున్.

ఆవిషాదవృత్తాంతంబు నాలకించి
కరఁగినది నిలువుననీరుగా నెలంత
సులభ బాష్పాంబుపూరముల్ నిలువలేక
కన్నుఁగవనుండి కాల్వలుగా స్రవింప.

పరుగుపరుగునఁ బోయి యూపల్లెటూర
సుందరుని విషాదోదంత మందఱకును
జాటిచెప్పంగ నొక్కటే గాటమైన
వాంఛ నిండారె నామెభావమున నపుడు.

అంతలో మున్ను తాఁబెట్టినట్టి యొట్టుఁ
దలఁచి చింతిల్లి యీగతిఁ బలికె నామె:
"ఒక్కసారి నీప్రాణము లున్నయపుడె
సుందరుఁడ! నీదుబిడ్డలన్ జూచుకొనుము!

"వారల నిప్డె తోడ్కొనివచ్చెద నీకడ" కంచుఁబల్కి పెం
పారినసంభ్రమంబుమెయి నామె తటాలున లేవ నామె వా
గ్ధోరణి నాలకించి యొకకొంచెమునే పెదియో తలంచి యీ
తీరున సత్యవాక్యములు దెల్పె నతండు సునిశ్చితాత్ముఁడై.

"వనితా! నా కవసానకాలము సమీపంబైన; దివ్వేళ నా
మనసున్ నీవు కలంతవెట్టఁజన దేమాత్రంబు; నన్ బూర్తిగాఁ
గొనసాగింపఁగనిమ్ము నాదుప్రతినన్; గూర్చుండి శ్రద్ధామతిన్
విన మా భాషణశక్తి యున్నపుడె నే విన్పించు వాక్యంబులన్.

"అంచితసౌఖ్యసంపదల నామె కొసంగుమటంచు నీశుఁ బ్రా
ర్థించుచు నామెఁగూర్చియ యదేపనిగా హృదయంబునందు భా
వించుచుఁ బ్రాణముల్ విడిచిపెట్టినయప్పుడుగూడ నామెఁ బ్రే
మించుచు జీవితంబు విరమించితినంచు వచింపు మామెకున్.

"మూడుమూర్తులఁ బల్లినిఁ బోలినట్టి
చిన్ని నాకొమరితకు నాశీర్వచనము
లిడుచుఁ గడసారి యూరువు విడిచినాఁడ
నని వచింపుము మఱవక యామెతోడ.

"నాకుమారునకున్ దీవనల నొసఁగుచు
నసులు వాసితి నని చెప్పు; మాకుమారుఁ
గూడ నాశీర్వదించినవాఁడ ననుము,
మంచియు తలంచె మాకుటుంబమున కతఁడు.

"చిన్నప్రాయంబునన్ బాసి నన్ను మఱచి
నట్టి మత్పుత్రి కాపుత్త్రు లభిలషింతు
రేని, వారలజనకుండఁగాన, నన్నుఁ
జూడఁగానిమ్ము ప్రాణముల్ వీడినంత.

"ఆమెమాత్రము నను దరియంగరాదు,
నన్ను వీక్షింపరాదు, ప్రాణములులేని
నాముఖంబా మెహృదయాన నాటి భావి
జీవితముఁ గళంకితముగాఁ జేయుఁ గాన.

"కలఁడు మఱియొక్కరుండు నాకన్నవాఁడు
నాకొఱకు దూరములఁ బరలోకమందు
నెదురుగనుచుండు నాశానిరీక్షణముల
నింపుగా నన్నతఁడు కౌఁగిలింపఁగలఁడు."

అనుచు నంతిమసందేశ మతఁడు పలుక
శ్రద్ధమెయి నాలకించిన వృద్ధురాలు
"నీవు చెప్పినయదియెల్ల నిశ్చయంబు
గా నొనర్చెద" ననుచు వాగ్దాన మొసఁగె.

కన్నుఁగవమూసి యాతఁ డొక్కక్షణ మూఁగి
మఱల నొకమాఱు కన్నులఁ దెఱచి మున్ను
దెలిపియుండినదంతయుఁ దిరుగ నుడువ
నామెయు వచించె "నొనరింతు నటులె" యనుచు.

నాఁటిరాతిరి యాతండు మాటలేక
కదలికయు లేక మోమునఁ గళయు లేక
నిదురఁగనియుండ నాతనిహృదయ మేమి
తలఁచుకొనియెనొ, యతఁ డేమికలలు గనెనొ.

ఆగభీరనిశ్శబ్దనిశాంతరమున
నొక్కపెట్టున దిక్కులు పిక్కటిల్ల
వినఁబడియె వార్ధిలోన నావిర్భవించి
ఘోరభీకరముగు నొకయారవంబు.

ఆ పయోగాశివీచికాప్లావనమునఁ
మేలుకని లేచి కూర్చుండి కేలుసాఁచి
"పడవ! పడవ! నే బ్రతికినవాఁడ!" ననుచు
నతఁడు గళమెత్తి గట్టిగా నఱచినాఁడు.

ఆ యఱపుతోనె మఱల శయ్యాతలమున
నతఁడు వెనుకకుఁ గూలినాఁ డాక్షణంబ
నిలిచిపోయిన యా మూఁగగళములోనఁ
జలనమే లేదు మఱియొండు పలుకె లేదు.

*

## కావ్యాంతము

శ్రితసంరక్షణకార్యదక్షుఁడు, బుధశ్రేణీస్తవాభ్యంచితా
చ్ఛతరప్రాకటకీర్తిశాలి, జయపూస్సామ్రాజ్యసింహాసన
స్థితుఁడౌ విక్రమదేవవర్మవసుధాధీశావతంసుండు మ
త్కృతినాథుం డఖిలార్థసిద్ధిఁ గని వర్ధిల్లుం జిరాయుష్కుఁడై.

*

*

# స వ ర ణ లు

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| ౧౦ | ౬ | యాత్వా | యాత్రా |
| ౧౯ | ౧౭ | బిడ్దల | బిడ్డల |
| ౪౮ | ౫ | తుండాథ | తుండాతి |
| ౫౦ | ౨౦ | యెటిదో | యెట్టిదో |

*

